# శ్రద్ధాంజలి

భోగ విలాసాలకు మితిలేని సంపన్నకుటుంబంలో పుట్టి, దేశ స్వాతంత్ర్యం కోసం, మొత్తం 17 సంవత్సరాలు జైలులో కటికి నేలమీద పడుకొని, అతి పేద పౌరునివలెనే కష్టపడిన త్యాగామూర్తీ, ఇదే మా అంజలి.

భోగ భాగ్యాలతో కూడిన దాస్యం కంటె, కూడుగుడ్డలు లేని స్వాతంత్ర్యం మిన్న అని ప్రపంచంలోని బానిస దేశాల ప్రజలందరినీ ఉత్తేజపరచిన స్వాతంత్ర్య పిపాసీ, ఇదే మా అంజలి.

పురాతన సాంప్రదాయాలను అంటిపెట్టుకొని అభివృద్ధిని నిరోధించిన జాతి ముందుకు రాదని ప్రజల నుద్బోధించి, దేశమంతటా అభివృద్ధి పథకాలను ప్రారంభించిన పురోగామీ, ఇదే మా అంజలి.

కుల తత్వాలూ, సంకుచిత భావాలూ జాతినీ, దేశాన్నీ అధోగతికి తెస్తాయని, సోదర ప్రజలకు విశాల దృష్టిని బోధించిన మహాపురుషా, ఇదే మా అంజలి.

శాస్త్ర పరిశోధనలు జరిపి, విజ్ఞాన పథంలో పట్టుదలతో పరుగెత్తకపోతే, భారతీయులు భావదాస్యంనుంచి విముక్తి పొందనేర రని అనేక విజ్ఞాన పరిశోధన సంస్థలను స్థాపించిన విజ్ఞానీ, ఇదే మా అంజలి.

కళలు, సారస్వతము ప్రభుత్వాదరము లేకపోతే వర్ధిల్లజాలవని, కళలకు, సారస్వతానికి ప్రోత్సాహం ఇవ్వడానికి అకాడమీలను స్థాపించి, కళాకారులకూ, రచయితలకూ గౌరవస్థానాన్ని ప్రసాదించిన విద్వచ్ఛిరోమణీ, ఇదే మా అంజలి.

నలుబదేండ్లుగా సోదర ప్రజల నిత్యజీవితంలో ఒక మార్గదర్శిగా, నాయకుడుగా మరువరాని పాత్రను నిర్వహించి, భౌతిక దేహాన్ని విడచినా ఆచంద్రతారార్కమైన ప్రఖ్యాతి గడించిన అమరజీవీ, ఇదే మా శ్రద్ధాంజలి.

# జీవిత సమీక్ష

జవహర్‌లాల్ నెహ్రూ పూర్వీకులు కాశ్మీర్ నుంచి ఉత్తరప్రదేశ్‌కు వచ్చినారు. కాశ్మీర్‌లో బ్రాహ్మణులకు పండిత నామం సాధారణం. అంచేత, జవహర్‌లాల్ కూడా పండిత జవహర్‌లాల్ అనే పిలువబడేవాడు. కుల నామ భేదాలు ఇష్టంలేని నెహ్రూ పండిత బిరుదును త్యజించినా, ఆయన మిత్రులు, సహచరులు ఆయనను పండిత్‌జీ అనే సంబోధించేవారు.

నెహ్రూ ముత్తాత సర్కార్ కంపెనీకి వకీలుగా వుండేవాడు. తాత ఢిల్లీలో కొత్వాలుగా వుండేవాడు. 1857లో జరిగిన ప్రథమ స్వాతంత్ర్య యుద్ధం సమయంలో, నెహ్రూ తాత ఢిల్లీనుంచి కాపురం ఆగ్రాకు మార్చాడు. నెహ్రూ తండ్రి మోతీలాల్ ఆగ్రాలోనే పుట్టాడు.

మోతీలాల్ అలహాబాద్‌లో లాయరుగా ప్రాక్టీసు ప్రారంభించి లాయర్లలో అగ్రశ్రేణికి వచ్చాడు. ఆయన భార్య స్వరూపరాణి. వీరి ప్రథమసంతానం, జవహర్‌లాల్, 1889 నవంబర్ 14వ తేదీన జన్మించాడు. తరువాత పదకొండేండ్లకు విజయలక్ష్మి జన్మించింది. పదకొండేళ్ళ వయస్సు వచ్చేవరకూ తల్లిదండ్రులకు ఏకైక సంతానంగా వున్నందున, జవహర్‌లాల్ అతి గారాబంగా పెరిగాడు. ఈయనకు చదువు చెప్పడానికి ఒక ఐరిష్ ట్యూటర్ను నియమించాడు తండ్రి.

జవహర్‌లాల్ తన పదమూడవ ఏటనే థియొసఫిస్టు అయ్యాడు. ఆయనకు ఉపదేశం చేసినది శ్రీమతి అనిబిసెంట్.

1905లో పదహారేండ్ల బాలుడుగా జవహర్‌లాల్ ఇంగ్లండు

ఆంధ్రకేసరితో





కళా వెంకట్రావు, పట్టాభిలతో

వెళ్ళాడు. కేంబ్రిడ్జి యూనివర్సిటీకి చెందిన ట్రినిటీ కాలేజీలో చేరి, వృక్షశాస్త్రము, రసాయన శాస్త్రము, భూగర్భశాస్త్రములను చదివి ఎం. ఏ. డిగ్రీని పొందాడు. తరువాత బారెట్లా అయ్యాడు. ఏడేళ్ళు ఇంగ్లండులో వుండి, బారెట్లాగా 1912లో తన 23వ ఏట మాతృదేశానికి తిరిగివచ్చాడు.

ఇంగ్లండులో వున్నప్పుడే, జవహర్‌లాల్ రాజకీయాలను బాగా అర్థంచేసుకున్నాడు. ఆనాడే ఆయనకు సోషలిస్టు భావాలు స్థిరపడి పోయినవి. తిరిగి మాతృదేశానికి వచ్చిన సంవత్సరమే బంకిపూర్‌లో కాంగ్రెసు మహాసభలో పాల్గొన్నాడు.

1916లో నెహ్రూకు శ్రీమతి కమలా కౌల్‌తో వివాహం అయింది. 1917లో, వీరి ఏకైక పుత్రిక ఇందిర జన్మించింది.

1919 ఏప్రిల్ 13వ తేదిన జలియన్‌వాలాబాగ్ దురంతాలు జరిగినప్పుడు, బ్రిటిష్ మిలిటరీ

దురంతాల పట్ల నెహ్రూకు జుగుప్స కలిగింది. ఈ దురంతాలను గురించి విచారణ జరుపడానికి చిత్తరంజన్‌దాస్ అమృతసర్ వెళ్ళినప్పుడు, ఆయనతో జవహర్‌లాల్ కూడా వెళ్ళాడు.

1919 లో అమృతసర్ కాంగ్రెసు మహాసభకు మోతీలాల్ అధ్యక్షత వహించాడు. అప్పటి నుంచీ నెహ్రూ కుటుంబం అంతా కాంగ్రెసుకే తమ జీవితాలను అంకితం చేశారు.

1921 లో గాంధీజీ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించాడు. ఆ సంవత్సరమే ఇండియాకు ప్రిన్స్ ఆఫ్ వేల్స్ వచ్చాడు. అతడి రాకను బహిష్కరించడానికి మహాత్ముడు నిర్ణయించారు. దేశం అంతటా మొత్తం 30,000 మంది కాంగ్రెసువారు అరెస్టు చేయబడినారు. అలహాబాద్‌లో ఈ బహిష్కరణోద్యమానికి నాయకత్వం వహించిన జవహర్‌లాల్ నెహ్రూ కూడా అరెస్టు చేయబడినాడు. ఇదే ఆయన మొట్ట మొదసారి జెయిలుకు వెళ్ళడం. తరువాత ఎనిమిది సార్లు నెహ్రూ జెయిలుకు వెళ్ళాడు. ఎనిమిది

త్రివేది, సంజీవరెడ్డిలతో





జనరల్ నీవిన్‌తో

దఫాలమొత్తం తొమ్మిది సంవత్స రాలు జెయిలులోనే జీవితం గడిపాడు.

జిన్నాతో



1923 లో కాంగ్రెసు మహా సభకు ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడి, చాలా సంవత్సరాలు ఆ పదవిలోనే వున్నాడు నెహ్రూ.

1929 లో మొట్టమొదటిసారి కాంగ్రెసు అధ్యక్షు డయాడు. అంతకుముందు సంవత్సరం అధ్యక్షుడుగా వున్న తన తండ్రి మోతీలాల్ నుంచే జవహార్‌లాల్ కాంగ్రెసు అధ్యక్ష పదవిని స్వీక రించాడు. 1932 లో మోతీలాల్ 1936 లో కమల, స్వర్గస్థు లయారు.

1923 నుంచీ, 1947 లో స్వాతంత్ర్యంవచ్చినదాకా, విరామ



ఐక్యరాజ్యసమితిలో ప్రసంగం.

రహితంగా స్వాతంత్ర్య పోరాటాన్ని సాగిస్తూనే వచ్చాడు. నెహ్రూ 1947 నుంచీ, భారత ప్రజల ఆర్థిక సౌభాగ్యానికీ, ప్రపంచ శాంతికీ స్వతంత్ర భారత ప్రధానిగా కృషి చేసి 1964 మే 27న అమరత్వం పొందాడు.



రవీంద్రనాథ్ ఠాగూర్‌తో



ప్రెసిడెంట్ కెన్నడితో—1961

జవహర్‌లాల్ నెహ్రూ ఎంత సుకుమారుడో, అంత కష్టజీవి. ప్రధానమంత్రిగా ఆయన రోజుకు 19 గంటలు పని చేసేవాడు. 1923 లో టైఫాయిడ్ జ్వరమూ, తరువాత ఒకసారి ప్లూరసీ తప్ప అనారోగ్యం ఎరుగడు. ప్రతిరోజూ ఉదయం పది నిమిషాల పాటు యోగాసనము వేసేవాడు.

ఏరికోరి బ్రహ్మదేవుడు సృష్టించినట్లుగా, జవహర్‌లాల్ చాలా అందమైనవాడు. మంచి వక్త. పేరు పొందిన రచయిత. కళా పిపాసి. ప్రజా హితుడైన పరిపాలకుడు. ఆబాల వృద్ధులు ఆయనను ప్రేమించారంటేనూ, ఆయన మరణించిననాడు దేశమంతా ఘొల్లున ఏడిచిందంటేనూ విచిత్రం ఏముంది!

75 ఏండ్ల జీవితంలో, 54 ఏండ్లు దేశసేవకే వినియోగించిన మహత్తర వ్యక్తి; అగ్రరాజ్యాల నాయకుల మన్ననలను పొందిన మహనీయుడు, జవహర్‌లాల్.



నాగార్జునసాగర్ శంఖుస్థాపన సమయమున
ఏ. సి. సుబ్బారెడ్డి, బూర్గుల రామకృష్ణరావు గార్లతో



నాగార్జునకొండ వద్ద మంత్రులతో

ప్రియతమ నాయకుడు





ఆంధ్రప్రదేశ్ మంత్రులు సంజీవరెడ్డి, ఏ. సి. సుబ్బారెడ్డి,
ఆలపాటి వెంకట్రామయ్య, మీర్ అహ్మద్ అలీఖాన్‌లతో

మాజీ రక్షణ మంత్రి బలదేవ్‌సింగ్‌తో





బ్రహ్మానందరెడ్డి, గొట్టిపాటి బ్రహ్మయ్యగార్లతో

డాక్టర్ రాధాకృష్ణన్, గోవింద వల్లభపంత్, డాక్టర్ రాజేంద్రప్రసాద్‌లతో





బుల్గానిన్, క్రుశ్చేవ్‌లతో



బెర్నార్డ్ షా



పోప్ పాల్ XII తో

కమల, ఇందిరలతో

చెల్లెలు కృష్ణహటీసింగ్, ఇందిర, హటీసింగ్‌లతో





వటువు



సకుటుంబంగా



తండ్రీ కొడుకులు, ఇంగ్లండు



భార్య కమాలా నెహ్రూ, కుమార్తె ఇందిరతో



కూతురు ఇందిర, మనుమలు సంజయ్, రాజీవ్‌లతో

యువ
సచిత్ర మాస పత్రిక
సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 10 జులై 1964 సంచిక 1

# నెహ్రూ అనంతరం

స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచీ 17 సంవత్సరాలు శ్రీ జవహర్ లాల్ నెహ్రూ అధ్వర్యాన నడిచిన కేంద్ర ప్రభుత్వం, నెహ్రూ వినాగా జూన్ తొమ్మిదవ తేదీన ఏర్పడింది. 17 సంవత్సరాలు, నెహ్రూ ఆధిపత్యాన నడిచిన ప్రభుత్వం, కేవలం నెహ్రూ వ్యక్తిత్వం మీదనే ఆధారపడివుంది. ఆయన ప్రధానిగా వున్నన్నాళ్ళూ, తక్కిన మంత్రులు ఎవరైనా అంత పరిగణించవలసిన విషయంగా వుండేది కాదు. నెహ్రూ ప్రధానిగా వున్నంతకాలమూ, దేశం దృష్టి ఆయనమీదనే వున్నది. ఎంతోమంది లోపాలను ఎంతోమంది అసమర్థతను కప్పిపుచ్చిన బ్రహ్మాండమైన వ్యక్తిత్వం గల మహాపురుషుడు నెహ్రూ.

నెహ్రూ అనంతర పరిస్థితి వేరు. ఆయన తరువాత ఏ మంత్రిమండలి ఏర్పడినా, అది దిట్టమైన మంత్రిమండలి అవునా కాదా అనే ప్రశ్న వస్తుంది. మంచి బలమైన మంత్రిమండలి—అంటే దేశంలోని సమర్థులలో చెప్పదగినవాళ్ళు ఎక్కువగా కల మంత్రిమండలి — ఏర్పడిందా, లేదా అని అందరూ చూస్తారు. ఈ దృష్టితో చూస్తే, ప్రస్తుతం ఏర్పడిన మంత్రిమండలి చాలా దిట్టమైనదనే చెప్పాలి. ఈ మంత్రిమండలిలో —

ముఖ్యంగా కేబినెట్ మంత్రిహోదాలో—వున్న వ్యక్తులు కాక, చాలా మంది సమర్థులు దేశంలో వున్నమాట వాస్తవమే. కాని, యీ మంత్రి మండలిలో వున్నవా రందరూ సమర్థతకూ, అనుభవానికీ ఎన్నదగిన వారే నన్నమాట మాత్రం వాస్తవం.

తనతో సహకరించి, దేశమంతటి అభివృద్ధికీ కృషి చేయవలసిన మంత్రులను ఎన్నుకోనడంలో ప్రధాని లాల్‌బహాదూర్ సునిశితమైన ప్రజ్ఞను ప్రదర్శించాడు. ఈ విషయంలో లాల్ బహాదూర్‌తో సంపూర్ణంగా సహకరించిన కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజ్ అభినందనీయుడు.

ఈ మంత్రిమండలి నిర్మాణ విషయంలో, ఆంధ్రప్రదేశ్‌కు కొంత మేలు జరిగింది. ఆంధ్రప్రదేశ్‌కు ముఖ్యమంత్రులుగా వున్నవారు ఇద్దరు, యీ మంత్రిమండలిలో సభ్యులుగా వుండటం ఆంధ్రప్రజలకు హర్షం కలిగించింది.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, కేంద్ర మంత్రిమండలిలో ఇద్దరు ఆంధ్రులు కేబినెట్ మంత్రుల హోదాలో నియమించబడటం ఇదే మొదటిసారి. ఆంధ్ర రాష్ట్రాన్ని గురించీ, ఆంధ్రప్రజల అవసరాలను గురించీ కేబినెట్‌లో గట్టి ప్రస్తావన రావడానికి అవకాశం ఇన్నాళ్ళకు ఏర్పడింది.

ఆంధ్రరాష్ట్రపు అవసరాలు తక్కువ కావు. పారిశ్రామికంగా చాలా వెనుకబడి వున్న రాష్ట్రాలలో ఆంధ్రరాష్ట్రం ఒకటి. దానికి కారణం, కేంద్రమంత్రుల ఉదాసీన భావమే కాని మరొకటి కాదు. ఎన్నో పరిశ్రమలను స్థాపించడానికి తగిన వసతులూ, సహజసంపదా ఎక్కువగా గల రాష్ట్రాలలో ఒకటై వుండికూడా, వెనకబడి వుండవలసిన దౌర్భాగ్య పరిస్థితి ఆంధ్రదేశానికి పట్టింది.

దక్షిణాన మదరాసు, మైసూరు రాష్ట్రాలను చూస్తే, రాష్ట్రీయ సంకుచితత్వానికి మితి వుందా అని ఆశ్చర్యం కలుగుతుంది. పదేళ్ళ పూర్వం వరకు ఆంధ్రదేశంతో కలసివున్న మదరాసు రాష్ట్రాన్ని చూడండి. రాష్ట్రరాజధాని అయిన మదరాసు నగరం కబంధుడిలాగ

పెరిగిపోతూనే వున్నది. ఏడాదికి అధమం రెండేనా భారీపరిశ్రమలు కొత్తగా మదరాసు నగరంలో స్థాపింపబడుతున్నవి. నగరంలోని ప్రజలకు కావలసిన నీటివసతి లేదు; రాష్ట్ర పరిశ్రమలకు కావలసినంత విద్యుచ్ఛక్తి సదుపాయం లేదు. అయినా, కొత్త పరిశ్రమలను స్థాపించడం అవిరామంగా సాగిపోతున్నది. ఆ పరిశ్రమలు కూడా చిన్నవి కావు. ఒక్కొక్క పరిశ్రమ, దాదాపు వెయ్యి కుటుంబాలకు జీవనోపాధి కలిగించగలది. ముందు పరిశ్రమలను స్థాపించడమూ, తరువాత వసతులకోసం ఆందోళన చేసి, వసతులను ఏర్పాటు చేసుకోవడం మదరాసు మంత్రుల పద్ధతి అయితే, అన్ని వసతులూ వున్నా పరిశ్రమలను స్థాపించడానికి కేంద్ర ప్రభుత్వ అనుమతిని సంపాదించే నాయకులు మనకు కేంద్ర ప్రభుత్వంలో లేకపోయారు.

మదరాసు రాష్ట్రం సంగతి చెప్పినప్పుడు, ఒక్క మదరాసు నగరం మాటేకాదు, మదరాసు రాష్ట్రంలోని ఇతర నగరాల మాటకూడా ప్రస్తావించవలసిందే. మధుర, కోయంబత్తూరు, తిరుచిరాపల్లి నగరాలు కూడా పెద్ద పెద్ద పరిశ్రమలతో కలకలలాడుతున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని పరిశ్రమ లన్నిటి విలువా, ఒక్క కోయంబత్తూరు నగరంలోని పరిశ్రమల విలువతో సరిపోలదంటే అతిశయోక్తి లేదు.

ఇక మైసూరు రాష్ట్రం మాట. కేంద్ర ప్రభుత్వం స్థాపించిన పరిశ్రమలే దాదాపు పది వున్నాయి. బెంగుళూరు నగరంలో స్థాపించినట్లయితే, గోదావరినుంచి నీళ్ళూ మాచ్‌కండ్ నుంచి విద్యుచ్ఛక్తి బెంగుళూరు నగరానికి సప్లయి చెయ్యవలసిన అవసరం ఏర్పడవచ్చును.

కేంద్రప్రభుత్వంలో మంత్రులైన సంజీవరెడ్డి, సంజీవయ్యగార్లు పరిశీలించవలసిన విషయాలూ, తక్కిన మంత్రులకు నచ్చచెప్పవలసిన విషయాలూ ఇవే.

కేంద్ర ప్రభుత్వ పరిశ్రమల విధానాన్ని కొత్త మంత్రిమండలి మార్చాలి. కొత్త పరిశ్రమల స్థాపనవల్ల నీటికి, విద్యుచ్ఛక్తి సప్లయికి, యిండ్లకు వసతి చాలని ఏ పెద్దనగరంలోనూ కొత్త పరిశ్రమలను స్థాపించనివ్వకూడదు. పారిశ్రామికంగా చాలా అభివృద్ధికి వచ్చిన మదరాసు, మైసూరు, మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్, గుజరాత్

రాష్ట్రాలలో, తక్కిన రాష్ట్రాలు కుడా వాటితో సమానస్థితికి వచ్చే వరకూ, కొత్త పరిశ్రమలను స్థాపించకూడదని కేంద్రప్రభుత్వం నిర్ణయించాలి. హైదరాబాద్ వద్ద రామచంద్రపురంలో భారీ విద్యుత్పరికరాల పరిశ్రమను స్థాపించడానికి నిర్ణయం జరగడమూ, అక్కడికి కొంత యంత్ర సామగ్రిని చేరవెయ్యడమూ జరిగిన తరువాత, ఆ పరిశ్రమను తిరుచిరాపల్లిలో స్థాపించాలని మంత్రి సుబ్రహ్మణ్యం ప్రయత్నించి, కొన్నియంత్రాలను తిరుచిరాపల్లికి పట్టించడమూ, అప్పుడు ఆంధ్రులు ఆందోళన చెయ్యగా, ఆ పరిశ్రమను యూనిట్లుగా విభజించి ఒక యూనిట్‌ను తిరుచిరాపల్లిలోనూ, మరొక యూనిట్‌ను రామచంద్రపురంలోనూ ఏర్పాటుచెయ్యడమూ జగమెరిగిన విషయమే. ఇతరరాష్ట్రాల నోట్లో మట్టికొట్టి, అక్కడ స్థాపించబడిన పరిశ్రమలను తమ రాష్ట్రాలకు తన్నుకుపోయే సమర్థులు కేంద్రప్రభుత్వంలో వున్నారు. అంచేత, ఇకముందు స్థాపించే పరిశ్రమ లన్నిటినీ, పారిశ్రామికంగా వెనుక బడిన రాష్ట్రాలలోనే స్థాపించాలనే నిర్ణయాన్ని కేంద్రప్రభుత్వం చేసేటట్టు, మన మంత్రులు పట్టుపట్టాలి. పారిశ్రామికంగా వెనుక బడిన రాష్ట్రాలైన మధ్యప్రదేశ్, ఒరిస్సా, అస్సాం, రాజస్థాన్ రాష్ట్రాల తరపున మంత్రు లెవరూ కేంద్రప్రభుత్వ కేబినెట్‌లో లేరు. అంచేత, ఆంధ్రమంత్రులు ఈ రాష్ట్రాల అభివృద్ధికికూడా తోడ్పడినవా రవుతారు.

ఆంధ్రప్రజలు కోరేది, అభివృద్ధికి వచ్చిన రాష్ట్రాలు నష్టపడాలని కాదు. అభివృద్ధికి వచ్చినరాష్ట్రాలు బాగుండగా, హీనస్థితిలో వున్న రాష్ట్రాలుకూడా బాగుపడా లనేదే మన కోరిక.

సంజీవరెడ్డిగారు, యీ విషయంలో గట్టిపట్టుదల చూపుతా రనే విశ్వాసం ఆంధ్రప్రజ లందరికీ వున్నది. రాష్ట్ర రాజకీయాలలో పోటీ భావం చూపినప్పటికీ, సంజీవరెడ్డిగారితో సంజీవయ్యగారు సంపూర్ణంగా సహకరిస్తా రనికూడా ఆంధ్రప్రజలు ఆశిస్తున్నారు.




చూపులో చూపు

# శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి జీవిత చరిత్ర

కొత్త ప్రధానమంత్రి అయిన శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి, అమరజీవి శ్రీ నెహ్రూ యొక్క అత్యంత విశ్వాస పాత్రులైనవారిలో ఒకరు. అందువల్లనే శ్రీ నెహ్రూ తమ విధిబాధ్యతల నిర్వహణలో ఆయనకు పాలుపంచారు. భారత ప్రధాన మంత్రిగా నిర్వహించవలసిన విధిబాధ్యతలూ, పరిష్కరించవలసిన సమస్యలూ శ్రీ లాల్ బహదూర్ శాస్త్రికి క్షుణ్ణంగా తెలుసు.

శ్రీ నెహ్రూ ప్రధానమంత్రిత్వంలో ఏర్పడిన మంత్రి మండలిలో ఆయన 1952 నుండి సభ్యుడుగా శ్రీ శాస్త్రి నిర్వహించిన అతిప్రముఖ పాత్రకుతోడు, అటు భారత ప్రభుత్వానికీ, యిటు కాంగ్రెసు పార్టీకి సమన్వయకారుడుగా, పరిష్కర్తగా, సామరస్య సాధకుడుగా ఆయన ఎనలేని సేవ చేశారు. అతి క్లిష్టమూ, పరిష్కారము అసంభవమూ అనుకున్న జటిల సమస్యలను — అటు ప్రభుత్వంలోనూ, యిటు కాంగ్రెసు పార్టీలోనూ — పరిష్కరించడానికి నెహ్రూ పూర్తిగా శ్రీ శాస్త్రిమీదే ఎక్కువగా ఆధారపడ్డారు. శ్రీ లాల్ బహదూర్ శాస్త్రియొక్క తొలి సహచరులలో ఒకరైన కీ. శే. పురుషోత్తమ దాస్ టాండన్ శ్రీ శాస్త్రి గుణగణాలను యిలా ప్రస్తుతించారు: "ఇరు పక్షాలనూ ఒక త్రాటిమీద నడిపి సామరస్యాన్ని సాధించగల బహు ప్రజ్ఞావంతుడు. క్లిష్ట సమస్యలను విడదీసి రాజీ కుదర్చడంలో ఆయనకు ఆయనే సాటి." ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాల మధ్య ఏర్పడిన వివాదాలే కానీయండి, రాష్ట్ర శాసనసభా నాయకత్వ ఎన్నిక సందర్భంలో అభ్యర్థిని ఎంచుకునే విషయంలో పొడసూపిన భేదాభిప్రాయాలే కానీయండి, కడు శక్తి సామర్థ్యాలు గల శ్రీ శాస్త్రి సూచించిన రాజీ మార్గం అందరికీ అంగీకారయోగ్యంగా వుండకతప్పదు. ఈ గుణగణాలన్నీ ఆయనకు పూర్వపు దేశీయాంగ మంత్రి కీ. శే. గోవింద వల్లభ్ పంత్ యొక్క వరప్రసాదాలు. శ్రీ పంత్ ఆయనకు రాజకీయ గురువులని చెప్పవచ్చు.

కీ. శే. పంత్ 1947 లో ఉత్తర ప్రదేశ్ ప్రధానిగా వున్న సమయంలో, శ్రీ శాస్త్రిని తమ పార్లమెంటరీ కార్యదర్శిగా తీసుకున్నారు. దానికి కారణం శ్రీ శాస్త్రి అందరికీ ఇష్టుడు. కష్టపడి

పనిచేసాడు. విశ్వాసపాత్రుడు శ్రీ నెహ్రూ జీవితకాలంలో శ్రీ శాస్త్రి ఈ గుణగణాలనే అభివ్యక్తం చేశారు

శ్రీ శాస్త్రి 1914 లో ఉత్తరప్రదేశ్ లోని వారణాసి జిల్లాకు చెందిన మొగల్‌శరాయ్‌లో జన్మించారు. ఆయన తండ్రి శ్రీ శారదాప్రసాద్, కొంతకాలం ఉపాధ్యాయుడుగా వుండి తర్వాత ప్రభుత్వోద్యోగం స్వీకరించారు. శ్రీ శాస్త్రికి $1\frac{1}{2}$ సంవత్సరాల వయస్సప్పుడే ఆయన తండ్రి మరణంతో ఆయన తన యిద్దరు సోదరీలతో మాతామహుని ఇంటికి వెళ్ళారు. తాతగారు ఆయన్ను వారాణాసిలో హరీశ్‌చంద్ర పాఠశాలలో చేర్పించి చదువు చెప్పించాడు. పదిహేడేళ్ళ వయస్సు వచ్చే వరకూ ఆయన ఆ పాఠశాలలో చదివాడు. ఆలోగా పాఠశాలలను, కలాశాలలను బహిష్కరించ వలసిందిగా మహాత్మా గాంధి యిచ్చిన పిలుపు నందుకుని ఆయన చదువుకు స్వస్తిచెప్పి సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. ఆ సందర్భంలోనే ఆయన్ను అరెస్టు చేశారు.

1921 లో జైలునుంచి విడుదలయిన తర్వాత ఆయన వారణాసిలోని కాశీ విద్యా పీఠంలో చేరి "శాస్త్రి" డిగ్రీని పొందారు. విద్య పూర్తికాగానే ఆయన రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించారు. శ్రీ శాస్త్రికి 23 వ ఏట శ్రీమతి లలితాదేవితో వివాహం అయింది. ఆయనకు నలుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలూ ఉన్నారు

1926 లో ఆయన సర్వెంట్సు ఆఫ్ ఇండియా యావజ్జీవ సభ్యులుగా చేరారు. తమ నివాసాన్ని అలహాబాదుకు మార్చారు. ఆయన నగరపాలక వ్యవహారాలలో హెచ్చుపాత్ర వహించి, అలహాబాదు మునిసిపాలిటీ సభ్యుడుగా ఎన్నికై 7 ఏళ్లు పనిచేశారు

ఆయన కాంగ్రెసు సంస్థకు సంబంధించిన అనేక ముఖ్యపదవులను అలంకరించారు. అలహాబాదు జిల్లా కాంగ్రెసు సంఘం కార్యదర్శిగానూ, 1930 నుంచి 36 వరకూ అధ్యక్షుడుగానూ పని చేశారు. 1935 నుంచి మూడేళ్ళపాటు ఉత్తరప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెసు సంఘం ప్రధాన కార్యదర్శిగా వున్నారు. కాంగ్రెసు పార్టీ సభ్యుడుగా ఎన్నికైనారు.

యువ కాంగ్రెసువాదిగా తన 25 వ ఏట సంపూర్ణ స్వాతంత్ర్యమే తన ప్రధాన లక్ష్యమని కాంగ్రెస్‌సంస్థ ప్రకటించింది. తీర్మాన ప్రతిపాదకులు వేరెవరో కాదు; శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూ.

1921 లోనూ ఆ తర్వాత 1942 లో కాంగ్రెసు నిర్వహించిన ప్రజా ఉద్యమాలన్నిటిలో శ్రీ శాస్త్రి పాల్గొని, ఏడుసార్లు జైలుకు వెళ్ళారు. ఆయన మొత్తం 9 సంవత్సరాలపాటు జైలులో వున్నారు.

1946 లో తిరిగి ఉత్తరప్రదేశ్ శాసన సభలో ప్రవేశించి ముఖ్యమంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి అయ్యారు. త్వరలోనే రాష్ట్ర హోం, రవాణా మంత్రి పదవి నలంకరించి ఐదేళ్ళపాటు పని చేశారు. ఆయన ఉత్తరప్రదేశ్ హోం మంత్రిగా వున్నప్పుడే, శ్రీ నెహ్రూ ఆయన శక్తిసామర్థ్యాలను గుర్తించి, రాష్ట్రపదవికి రాజీనామా యిచ్చి అంతకంటె గురుతరమైన కార్యభారాన్ని స్వీకరించవలసిందిగా కోరారు.

స్వతంత్రభారతదేశంలో తొలిసారిగా 1951 లో తొలి జనరలు ఎన్నికలలో కాంగ్రెసు పోటీకి నిలబడింది. అఖిలభారత స్థాయిలో ఎన్నికల ప్రచార నిర్వహణకు సమర్థుడైన వ్యక్తి అవసరమైనాడు. శ్రీ నెహ్రూ ఆయన్ను ఢిల్లీకి పిలిపించి కాంగ్రెసుపార్టీ ప్రధాన కార్యదర్శిగా నియమించారు. ఎన్నికలలో కాంగ్రెసు అఖండ విజయాన్ని సాధించడం శ్రీ లాల్ బహదూర్ శాస్త్రియొక్క ఘనతే అని చెప్పాలి.

1952 లో ఆయన రాజ్యసభసభ్యుడు అయారు. ఆ సంవత్సరం మేనెలలో కేంద్ర రవాణా, రైల్వేశాఖల మంత్రిగా ఆయన నియుక్తులైనారు.

నాలుగేళ్ళతర్వాత అంటే 1956 నవంబరులో అయ్యలూర్ వద్ద జరిగిన రైలు ప్రమాదానికి రాజ్యాంగరీత్యా తాను బాధ్యుడని భావించి మంత్రిపదవికి రాజీనామా యిచ్చారు. ఆ ప్రమాదంలో 150 మందికి పైగా మరణించారు. ఆయన నిర్ణయాన్ని పార్లమెంటూ, దేశమూ హర్షించింది.

ఆ సందర్భంలో కీ. శే. శ్రీ నెహ్రూ పార్లమెంటులో మాట్లాడుతూ, శ్రీలాల్ బహదూర్ అత్యుత్తమమైన నిజాయితీ, విధ్యుక్తధర్మ నిర్వహణదీక్ష కలవాడని ప్రస్తుతించారు. ఆయన అమాయకత్వం చాటున మంచి నిబ్బరం, కార్యదీక్ష దాగి వున్నాయి. ఆ రాజీనామా సందర్భంలో రెండు గంటలు జరిగిన చర్చకు శ్రీ శాస్త్రి సమాధానం చెపుతూ నవంబరు 17 న పార్లమెంటులో యిలా అన్నారు: "నేను భారీ మనిషిని కానందునా, మృదుభాషిని అయినందునా నాకు దృఢసంకల్పం లేదని ప్రజలు అనుకోవచ్చు. నాకు కండపుష్టి లేకపోయినా, అంతరంగికంగా అంత బలహీనుణ్ణికాను.''

ఆయన ఎంతోకాలం ప్రభుత్వాన్ని విడిచి వుండలేదు. 1957 లో రెండవ జనరలు ఎన్నికలు జరిగినప్పుడు, ఆయన లోకసభకు తిరిగి ఎన్నిక అయారు. 1957 ఏప్రిల్ 17న ఆయన కేంద్ర రవాణా కమ్యూనికేషన్సు మంత్రిగానూ, 1958 మార్చి 8 న కేంద్ర వాణిజ్య, పరిశ్రమల మంత్రిగాను నియమించబడ్డారు

వాణిజ్య, పరిశ్రమల మంత్రిగా వ్యవసాయ _ పరిశ్రమల ఏకీకరణకు ఒక పథకాన్ని రూపొందించారు ఆ రెండింటి సమ్మేళనంవల్ల గ్రామ ప్రాంతాలలో నిరుద్యోగ సమస్య తొలగిపోయిం దని ఆయన విశ్వాసం. గ్రామ పరిశ్రమలను

21 లేక 35 ఏళ్ళలో చిన్నతరహా పరిశ్రమలుగా మార్పు చేయాలని ఆయన సంకల్పం ఆ రంగంలో తర్వాతి అభ్యుదయానికి ఆ పథకమే ప్రాతిపదిక.

పండిట్ గోవిందవల్లభ్ పంత్ మరణించడంతో, 1961 ఏప్రిల్ 4 వ తేదీన శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి కేంద్ర హోం మంత్రిపదవిని స్వీకరించారు. హోం మంత్రిగా తాను నిర్వహించవలసిన బాధ్యతలదృష్ట్యా, మధ్యవర్తిగా, పరిష్కర్తగా, ఆయన శక్తిసామర్థ్యాలు అస్సాంలోని భాషా సమస్యను పరిష్కరించడంలో ప్రస్ఫుటంగా కానవచ్చాయి. ఆ రాష్ట్రంలోని అస్సామీలు, బెంగాలీల మధ్య శాశ్వత ప్రాతిపదికపై ఆయన సామరస్య సద్భావాలను సాధించారు.

1953 మార్చిలో నేపాలుకు వెళ్ళిన సుహృద్భావ సంఘం నాయకుడుగా ఆయన ఘనవిజయాన్ని సాధించారు. కొలదికాలంగా నేపాలు భారతదేశ సంబంధాలు భేదాభిప్రాయాలు, అపోహల కారణంగా కొంత ఉధృతం చెందాయి. శ్రీ శాస్త్రి కార్యదీక్ష, రాజీమార్గం, ఓర్పుల ఫలితంగా ఉభయదేశాల సంబంధాలు తిరిగి చక్కబడ్డాయి.

కామరాజ్ పథకం దృష్ట్యా కాంగ్రెసు సంస్థ కార్యకలాపాల నిర్వహణకై శ్రీ శాస్త్రి 1963 ఆగస్టులో కేంద్రమంత్రి పదవికి రాజీనామా యిచ్చారు. కాని 1964 జనవరి 24 న ఆయన పోర్టుఫోలియో లేని మంత్రిగా తిరిగి కేంద్ర మంత్రివర్గంలో చేరారు

కాశ్మీర్‌లో పవిత్రకేశం చోరీకి సంబంధించిన జటిల సమస్యను పరిష్కరించడానికి ఆయన్ను అప్పగించారు. ఆయన కృషిఫలితంగానే ఆ సమస్య శాంతియుతంగా పరిష్కార మైనది.

శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి మదాం క్యూరీ జీవితచరిత్రను హిందీలో రచించారు. ఈత, బ్యాట్‌మెంటన్, టేబుల్ టెన్నిసు అంటే ఆయనకు ఎంతో యిష్టం. శ్రీ నెహ్రూ వలెనే ఆయన్నకు బాలలంటే మక్కువ ఎక్కువ. ఆయనకు క్షణం తీరిక దొరికితే బాలలతో కాలం గడుపుతాడు. "నేను పొట్టిమనిషి నవడం వల్ల నాతో ఆటలాడటాని కెవ్వరూ ఇచ్ఛగించరు. అందుకనే నేను బాలలతో ఆడుకుంటా" నని ఆయన ఇటీవల అన్నారు.

ఆయనలో మంచి హాస్యం, సంభాషణాచాతుర్యం వున్నాయి. బాలల సంఘంలో బహుమతి ప్రదానం చేయడానికి ఆయన్ను ఆహ్వానించగా ఆయన యిలా అన్నారు: "నా కురుచదనాన్నిబట్టే నన్ను యీ ఉత్సవానికి ఆహ్వానించారు."

శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ఎంతటి సాధుస్వభావుడో అంతటి దృఢనిర్ణయం కలవాడు. ఎంత వినమ్రుడో అంతటి కరుకుదనం కలవాడు. భారతదేశ రాజకీయాలపట్లా, పాలక వ్యవహారాలపట్లా గల సుదీర్ఘానుభవంతో, ఆయన భారత ప్రధానమంత్రి పదవిని అధిష్ఠించారు.




తాతయ్య అన్నాడు

"మన మెప్పుడూ వుద్యమంయొక్క మంచిచెడ్డలు చూడవలసిందేగాని, వుద్యమం లేవదీసినవాళ్ళ కారక్టర్ను గురించి మాట్లాడగూడదు అలాగైతే, మార్క్సు, రాయి —"

"రాయా ?"

"ఆఁ రామమోహన్‌రాయి, యం. ఎన్ రాయికాదు — హిట్లరూ, చెలపతీ —"

"చెలపతెవరూ ?"

"నీకు ఒక్కటీ తెలీదు — అంతా ఎరిగినట్టు పోజు చేస్తావు వాడి చలవని నేను ఒక లక్ష బ్యాంకులో వేసుకోటమే కాకుండా తలెత్తుకు తిరుగుతున్నాను ?"

తాతయ్య తృప్తిగా నిట్టూర్చాడు.

"ఎవరా మహానుభావుడు ?"

"నీకెలా తెలుస్తుందోయ్ ? ఒక్క పుస్తకం చదవ్వు ! మా చిన్నతనంలో అతని రచనలకోసం తన్నుకునేవాళ్ళం. అతని పుస్తకం దొరికిందంటే బడి ఎగ్గొట్టి, తలుపులు [illegible]ంచి చదువుకునే వాళ్ళం — పెద్దవాళ్ళు తిట్టనీ, కొట్టనీ తర్వాత."

"మరిప్పుడు ! —"

"ఏమిటిప్పుడు ? అతనిపని తీరిపోయింది. అతను వేసిన వి[illegible]తనం అంతటా పాకింది. అందుకనే మీకళ్ళకి అది విలక్షణంగా కనపడడం లేదు. సరే, ఒకటి అడుగుతాను ; లంచం పుచ్చుకోటం తప్పా ?"

"ఎవరంటారు, ఆ మాట ?"

"అన్నారు ఒకప్పుడు. ఆ పని చేసినందుకు చెల[illegible]తి[illegible]పు[illegible]గులాగా మాశారు !"

"మరి అతను ఊరుకున్నాడా ?"

"ఊరుకోలేదు, ఎదురుతిరిగి, అందరితో పోట్లా[illegible]డు."

"నువ్వెరుగుదువా ?"

"నేను చిన్నవాణ్ణి; మా నాన్న బాగా

'చక్రపాణి'

ఎరుగు ఆయన చెప్పిన విషయాలే నీకు చెప్తుతాను "

* * *

చెలపతీ అందరిలాంటి మనిషే అందరిలో వుండే లోట్లు అతనిలోనూ వున్నై. కాని, అందరూ తమలో వున్న అన్నిలోట్లూ దాస్తే, చెలపతి నూటికి ముప్పాతిక తనే బయటపెట్టేవాడు — ఇతర్లకు సందివ్వకుండా, ఇవే అన్నీ అన్నట్టు। ఇక యితర్ల విషయంలో చెలపతి డాక్టరులాగా ప్రవర్తించేవాడు. నిర్దయగా, మత్తుమందివ్వకుండా, స్పృహలో వుండగానే వాళ్ళ 'లోట్ల'నే కుళ్ళ శస్త్రంచేసి పారేశేవాడు. అంతా బాధ కోర్చుకుని కూడా చికిత్స చేయించు కునేవాళ్ళు. చేయించుకోక ఏం చేస్తారు? తమ నోటితో తమలోట్లను చెప్పుకోలేక పోయారుగాని, ఒకళ్ళు చూపినప్పుడు వొప్పుకోక చస్తారా? పైగా చెలపతి నిప్పంటి మనిషని వాళ్ళ నమ్మకం. అతని నోటికి వెరిచేవాళ్ళుకూడా. ఆఫీసులో అంతా అతన్ని రెస్పెక్టు చేసేవాళ్ళు. ఒకానొక సందర్భంలో చెలపతి గడ్డి కరవవలసి వొచ్చింది, కరిచాడుకూడా. కాని, కొత్తకావటంవల్ల జీర్ణించుకోలేక పోయాడు. ఆ పసరు కళ్ళకి తట్టి, అతనికి ప్రపంచం మరోవిధంగా కనుపించ నారంభించింది. సాటివాళ్ళంతా తన్ను సందేహిస్తున్నారని అనుకున్నాడు. ఎలా తెలిసిందీ వాళ్ళకి? తను కతిగింది చుట్టాల దగ్గరగా, అదీ పై అధికారి కిస్తానని చెప్పి। చెలపతికి చిక్కు వీడ లేదు. విడదీయటానికి చూసినకుందికీ పెనవేసుకుపోయింది

కాని చెలపతిని ఎవ్వరూ అడగలేదు, ఆ ప్రశంసకూడా తేలేదు।

చెలపతికి ఈ మౌనం మరీ దుర్భర మైంది। అధికారి పిలిచి అందరి ఎదటా చివాట్లు వేసినా అతని కింత కష్టముండేది కాదు, సమాధానం చెప్పుకునేవాడు. కాని, ఈ కేటాయిం పేమిటి? చెలపతి ఆగలేకపోయాడు.

"మా వాడు జలగలాగా పట్టుకుంటే గత్యంతరంలేక చేశాను" అన్నాడు రామ్మూర్తి దగ్గర.

"ఏమిటీ?" అన్నాడు అతను.

చెలపతికి వొళ్ళు మండింది. వెధవ తెలియనట్టు నటించి తన నోటిమీదుగా చెప్పించాలని చూస్తున్నాడని అనుకుని అతనితో పోట్లాడాడు.

ఆ పూట చెలపతి యింకా యిద్దరి ముగ్గురితో అని చూశాడు. కాని, వాళ్ళూ అదేవిధంగా ప్రశ్నించారు. చెలపతి బుస కొట్టి ఊరుకున్నాడు. ఎంతమందితో అని పోట్లాడతాడు? ఆఖరికి జాలయ్యే ఐనా సానుభూతి చూపుతాడేమోనని తంటాలు పడ్డాడు. కాని సానుభూతి సంపాదించేదెలా? — ఆడవాళ్ళ పేరు చెప్పితే?

"మా మరదలు ఒకటే తీరున వేధిం

చిందోయ్, నాకు తప్పక —" అన్నాడు.

"తప్పక ?" అన్నాడు జాలయ్య. 'ఆఁ, దాని కేం ఫర్వాలేదు' అనకండా.

చెలపతి వచ్చిన కోపాన్నంతా దిగ మింగాడు, శివుడు విషాన్ని మింగినట్టుగా: ఐతే, శివుడికి విషం మింగినందుకు కంఠం నల్లబడింది. చెలపతికి మొఖం ఎఱ్ఱబడింది.

ఆఫీసునించి యింటి కొచ్చేటప్పుడు నారాయమూర్తి కలిశాడు. అతనితో వెను కటిధోరణి మాని — "మన మేనేజరికి దానుడు ఎక్కువైంది" అన్నాడు చెలపతి.

"ఆఁ, ఎవరికి కాలేదు లెద్దూ ?" అన్నాడు నారాయణమూర్తి.

చెలపతి అక్కడికీ తమాయించు కున్నాడు.

"అది నిజమే. కాని, ఆ నీలు గెందుకూ ?" అన్నాడు.

"ఎవరికి లేదు. అంతా అపరబుద్ధులే!"

చెలపతి పిచ్చికుక్కలాగా రేగాడు. అది బజారు, నలుగురూ తిరుగుతున్నా రనే ధ్యాసకూడా లేకుండాపోయింది. నలుగుర్నీ చాటుచేసుకొని నారాయణ తప్పించుకు పోయేవరకు బ్రహ్మప్రళయ మైంది.

మర్నాడు చెలపతి ఆఫీసు కెళ్ళేవరకు తోటిక్లర్కు లంతా కూర్చుని లోకాభి రామాయణం మాట్లాడుకొంటున్నారు. నారాయణమూర్తి అంటున్నాడు :

"మాంసం తింటున్నా మని యెము కలు మెడని వేసుకుంటామా ? ఏదో కాస్త చాటూ మరుగూ అని..." చివరి క్రియను అభినయంతో వ్యక్తం చేశాడు.

"అది నిజమే. కాని మోరల్ బ్యాక్ బోన్ లేకపోయినాక మనిషి ఎందుకూ ? మన చెలపతిని చూడూ, అతనికి ఎవ రన్నా భయంలేదు." అన్నాడు నరహరి.

"అయ్యగారికి రాచకాలే లేవు. ఏం చేసినా పబిలీగ్గా సేత్తారు" అన్నాడు ఆఫీసు బంట్రోతు, వేష్టుపేపరుబాస్కెటు తీసుకుపోతూ.

ఎందుకనో ఆవేళ చలపతి వాళ్ళ సంభాషణను ప్రశంస క్రింద మార్చుకో లేకపోయాడు. అంతా కలిసి తన్ను తాళం వేయిస్తున్నా రని అనుకున్నాడు. వెధవ బంట్రోతుకూడా వెటకారమా ? చెలపతి ఆవాళ సవ్యసాచిలాగా అందర్నీ ఎదుర్కొన్నాడు, ఓడించాడుకూడా.

మర్నాడు ఆఫీసులో చెలపతిని ఎవరూ పలకరించలేదు. వాళ్ళ మౌనం, పెదాలు బిగిపట్టి నవ్వుకోటం అతను అసలు భరించలేకపోయాడు. తనంటే అంత చులకనా వీళ్ళకి ? వాళ్ళకి బుద్ధి చెప్పాలి. అంతా కలిసి అతన్ని వెలేస్తే అందర్నీ చెలపతి వెలివేశాడు. వాళ్ళు కూర్చున్నచోట కూర్చోకూడదనికూడా నిశ్చయించుకున్నాడు.

ఆ సాయంత్రమే చెలపతి నవ్వుతూ తన గుమాస్తాపనికి రాజీనామా యిచ్చి, విషాదంతో యింటికి తిరిగివచ్చాడు.

ఇంట్లో ఇల్లాలూ, పనిమనిషి సుబ్బామా కీచులాడుకుంటూ ఉన్నారు. 'పోలిశెట్టి కొలతలో తగ్గించా'డంటున్నదిసుబ్బామ. 'కాదు నువ్వే డబ్బులు పిక్కావు' అంటున్నది ఇల్లాలు.

చెలపతి ఇద్దర్నీ సర్దాడు. అతనికి సుబ్బామ స్థితి చూస్తే జాలివేసింది. టీ పుచ్చుకుని ఆలోచనలో పడ్డాడు.

"వంచన ఎక్కడలేదూ ?" అన్నది మనస్సు.

"అంతటా ఉంది" అన్నది బుద్ధి.

"మరి సుబ్బామని నిలవదీయట మెందుకూ ?" అన్నది మనస్సు.

"అది నోరులేంది గనక" అన్నది బుద్ధి.

"దాన్ని సమర్థించేవా ళ్ళెవరూ లేరా ?" అన్నది మనస్సు.

ఈమాటు బుద్ధి సమాధాన మివ్వ లేదు. మళ్ళీ ప్రశ్నించింది.

"నువ్వే చెయ్యకూడదూ, ఆ పనీ ?"

ఎలా చేస్తాడూ ? ఉపన్యాసాలద్వారా చెయ్యటానికి చాలా ఇబ్బందులున్నై. ముందు ప్రతి అంట్లవెధవా వేసే ప్రశ్నలకి జవాబు చెప్పాలి. ఇక మామూలు ప్రమాదాలా, ఉండనే ఉన్నై. పోతే, ఇక పత్రికలకి రాయాలి. మరి లంచాల్ని సమర్థిస్తే పత్రికలు వేస్తాయా ? వేసినా వెయ్యకపోయినా ముందు రచన తయారు చేసి చూడాలి.

చెలపతి కాగితం కలం తీసుకున్నాడు. కాని, కలం హర్తాంచేసింది. చొచ్చదోలి, మళ్ళీ ప్రయత్నించాడు — కోతిగంతులు వేసింది. అంకెలు పడ్డాయి.

ఈ కాలపు కుర్రవాళ్ళు వొప్పుకోరు గాని, ప్రతి కార్యానికీ దైవప్రేరణ ఉండి తీరుతుంది. అది లేకపోతే, ఎన్నో ఉద్యమాలు అడుగంటేవి. ఈనాడు గాంధిని చూడరాదూ — ప్రతీపనీ దైవ ప్రేరణతోనే చేస్తాడు...సరే ఇప్పుడా గొడవ పోనివ్వు...

చెలపతి కలాన్ని స్వాధీనం చేసుకోలేక నానా అవస్థా పడుతుండగా, గాలి దేవుడి ప్రేరేపణతో పొట్లాముకి చుట్టిన చిత్తుకాగితం వచ్చి అతని ముందు పడింది. తీసి చూశాడు. అదో అమెరికన్ పత్రికలోది. దాంట్లో చిన్న కథ దొరికింది. 'దగా' దాని శీర్షిక. చదివి చూశాడు. అచ్చంగా తను రాయదలచుకున్నటువంటిదే ! వాడి కెలా తెలిసిందీ ? న్యూయార్కులో ఉన్న వెధవకి ! తన థీమ్ కొట్టేసినందుకు ముందు చలపతికి వాడిమీద కష్టం కలిగింది. కాని, తర్వాత వాడు రాసిపెట్టినందుకు సంతోషపడ్డాడు.

ఆ కథ సార మిది. రోజా అనే పని మనిషి తన యజమానురాలికోసం 'ఫోర్ జెట్ స్టోర్స్' లో కొన్ని సామానులు కొంటుంది. షాపువాడు మంచివస్తువుల ధరలు వేసి చౌకవస్తువులు ఇస్తాడు. తర్వాత యజమానురా లొచ్చి చౌక వస్తువు లిచ్చావే మని అడిగితే మీ పని

మనిషి ఇవే యిచ్చి బిల్లు అలా రాయమన్నదని చెప్పుతాడు యజమానురాలు అది నమ్మి రోజాను పనిలోనించి తీసి వేస్తుంది.

చెలపతి చప్పున రోజాకు స్కర్టు విప్పదీసి, కోక కట్టాడు 'పోర్ జెట్ స్టోర్స్' పోలిశెట్టి అంగడిగా మార్చాడు పోతే పోలిశెట్టి అంగడిలో మెంతులూ, జీలకర్ర, ఆవాలు వగైరా మసాళా దినుసులుకూడా ఉంచవలసివచ్చింది లిప్‌స్టిక్, స్నో, హెయిర్ లోషన్ వగైరాలు తీసివేశాడు, రోజా పేరు మార్చి సుబ్బామ ఉంచాడు ఇక క్లయిమటిక్ కండిషన్స్‌ను బట్టి ఇద్దరికీ మొఖాన తారు పూశాడు అదనంగా పోలిశెట్టిలో లక్ష్మి ఉండి పోయేలాగా చేశాడు ఆ కధ చూసి, సంపాదకుడు వెంటనే ప్రకటించటమే కాకుండా, ఇంకా పంప మని ఉత్తరం రాశాడు మిత్రు లంతాకూడా చలపతిని ప్రోత్సహించారు, వీపు తట్టారు

చెలపతి రెట్టించిన ఉత్సాహంతో సాహిత్యసేవకు పూనుకున్నాడు సుబ్బామని పంపి ఒక వీశెడు చిత్తు కాగితాలు తెప్పించాడు అదృష్టవశాత్తు అవన్నీ ఒకటే సంచికలు అయినవి వాటిని ఉపయోగించలేదు తర్వాత డిటెక్టివ్ కధల పుస్తకాలూ, క్రైమ్, ఫిక్షన్ నావెల్సూ తెప్పించి, వాటిలో తను ఆలోచించిన థీమ్సు ఎవరన్నా దొంగిలించారా అని చూసేవాడు. పుస్తకాలు ఎక్కువ చదివినకొందికీ అతనికి ఆశ్చర్యమూ కోపమూ కలిగేది సరిగ్గా ఇతను ఆలోచించిన థీమ్సన్నీ అదివరకే ఎవడో ఒకడు కొట్టేసి ఉన్నాడు. పోనీ చక్కగా రాశారా అంటే అదీ కనబడదు!

ఏం చేస్తాడు చెలపతి? మళ్ళీ దేవుడా అంటూ ఆ థీమ్సు అన్నీ రాసుకున్నాడు కొన్ని కధలను నాటికలుగానూ, కొన్ని నాటికలను కధలుగానూకూడా మార్చుకోవలసివచ్చింది

అతని రచనలు పత్రికల్లో పడటం మొదలుపెట్టినాక, దేశంలో పెద్ద అల్లకల్లోలం బయలుదేరింది. మామూలు చెరువులో పెద్దచేపలు వచ్చిపడితే, మిగతా చేపలు ఎలా ఫీలవుతాయో అలా ఫీలయ్యారు ప్రజలు అతని ఉనికికి వాళ్ళిలా బెదిరిపోవటానికి కారణంకూడా కొంతమంది స్వార్థపరులే

థ్యాంక్ గాడ్! ఈ నాటికైనా అతను చేసిన సేవ లోకం ఒప్పుకుంటున్నది.

"ఏమిటతను చేసిన సేవ?"

రెండు ఉద్గ్రంథాలు రాశాడు ఒకటి_ దొంగతనాలు సమర్థిస్తూ, రెండు_లంచాలు సమర్థిస్తూ!"

"ఎలా సమర్థించాడు?"

"దొంగతనం ఒక ఇన్‌స్టింక్ట్. అది ప్రతివాడిలోనూ ఉంటుంది. కొంతమంది పిరికివాళ్ళు అది చెయ్యరు అంతమాత్రం చేత వాళ్ళు మహాత్ములు కారు చేసిన వాళ్ళుకూడా కొంతమంది తెలివిగలవాళ్ల

పట్టుబడరు. అంతమాత్రంతో వాళ్లు దొంగతనం చెయ్యనివాళ్ళు కారు. పోతే తెలివితక్కువవాళ్ళే చిక్కుకున్నారు. వాళ్ళని పై రెండురకాలవాళ్ళు, ఎగతాళి చేస్తున్నారు. దండిస్తున్నారు. వాళ్ళని దండించడం న్యాయంకాదు. ఎవరికి కావలసిన వస్తువు వాడిదగ్గర లేనంత వరకూ ఈ దొంగతనాలు జరుగుతూనే ఉంటై. కాబట్టి ఎవడికి కావలసినవి వాడికి సప్లయి చేయాలి, లేదా దొంగతనానికి దండన తీసివేయ్యాలి ఇవి రెండూ చేయలేని పరిస్థితుల్లో పిల్లలకు స్కూళ్ళలోనే దొంగతనం చేయడంలోగల మెలుకువలు చెప్పాలి."

"సరే, రెండోది ?"

"రెండోది నా 'కాపిటల్ !' చాలా గొప్పగ్రంథం. లంచంలో మోసం లేదంటాడు చెలపతి లంచం ఇద్దరి ఇష్టంమీదా జరిగే బేరం. అందులో ఎవరి కిష్టంలేకపోయినా, మానుకోవచ్చు. నిర్బంధమేమీ లేదు వివాహాల 'టరమ్సు'లో తీసుకుంచే లంచం గాంధర్వం లాంటిదంటాడు చెలపతి. దొంగతనం రాక్షసమంటాడు. ఆయా పరిస్థితుల్నిబట్టి రెండూ సమానంగా సమర్థనీయాలే. దూరం ఆలోచిస్తే లంచం అన్ని కాలాల్లోనూ, జాతుల్లోనూ ఏదో ఒక రూపంతో ఉందంటాడు చెలపతి. లంచానికి ఇంకో పేరు గడ్డి కరవడం అది ఎలా వచ్చిందీ ? పూర్వం ఋషులు ప్రజలూ, శిష్యులూ ఇచ్చినకందమూలాలూ నీహారధాన్యమూ తింటూ 'ఏదో అకూ అలమూ తిని బతుకుతున్నాము' అనేవాళ్ళు ఎందుకన్నారు వాళ్ళలా ? లంచ మని చెప్పకోట్రానికి ఇష్టంలేక ! కాబట్టే లంచాని కింకోపేరు గడ్డికరవడ మయింది. కానుకలూ, నూడిదలూ, కప్పాలూ, కమీషనూ అంతా లంచంకిందికే వస్తుంది ఆఖరికి మన్వింటికెళ్ళేటప్పుడు తీసుకుపోయే పొట్లాము కూడా."

తాతయ్య పకపక నవ్వాడు,

"ఇలాంటివి చాలా చదివాను ఇంగ్లీషులో" అన్నాను నేను.

"నీ మొహం ! ఇంగ్లీషువాళ్ళకు ఋషులెక్కడ ఎడ్చారురా" అన్నారు తాతయ్య.



# బహిష్కారం

## 'వాచస్పతి'

భారమైన కనురెప్పలను ఎత్తి చుట్టూ కలయచూసింది సుజన

కొన్ని క్షణాల తర్వాత ఆమె చూపులు ప్రక్కనే కూర్చొనున్న మాధవిమీద విశ్చలంగా నిలిచాయి.

మనోజ్ఞంగా. గంభీరంగా ఉన్న మాధవి కళ్ళు ఏదో ప్రశ్నించినట్లయ్యాయి.

సుజన ఏదో కళ్ళతోనే జవాబు చెప్పింది. ఆభాష వాళ్ళిద్దరికే అర్థమైంది.

మాధవి చూపులు త్రిప్పుకొంది — మెల్లగా. సుజన మెల్లగా. అతి మెల్లగా నిట్టూర్చి నిశ్శబ్దంగా కళ్ళు దించుకుంది

సుజన విడవిన ఆ నిట్టూర్పు ప్రక్కనే కూర్చొనున్న విజయకుమార్‌కుగానీ. మాధవికిగానీ, ఎదురుగా కూర్చొని మంత్రాలు చదివిస్తున్న పురోహితునికిగానీ వినిపించనే లేదు

విశాలమైన పెళ్ళిపందిరిలో బంధువులూ, మిత్రులూ కూర్చొనున్నారు — నూతన వధూవరులను శాశ్వత బంధంతో బంధించేందుకు సంసిద్ధులై

మంగళ వాయిద్యాలు మంత్రోచ్చరణలో లీనమై శుభకరమూ మనోహరమూ అయిన దివ్యలోకాల మంజుల సంగీతంలా. వీనులవిందులా ఉంది.

పురోహితుడు ప్రక్కకుతిరిగి —

"ఊఁ... మంగళసూత్రధారణ జరుగబోతోంది... పెద్దగా వాయించండి!" అన్నాడు, వాయిద్యగాళ్ళవేపు చూసి.

పందిరంతా మంగళ వాయిద్యాలతో మారు మోగిపోయింది.

విజయకుమార్ మంగళసూత్రం తీసుకుని లేచి నిల్చున్నాడు.

సుజన కళ్ళెత్తి నేరుగా గేటువేపు చూసి, తిరిగి నెమ్మదిగా కనురెప్పలు వాల్చింది.

మంగళసూత్రధారణ జరిగిపోయింది.

* * *

"అందరూ ఏమంటున్నారో తెలుసా?" మెల్లగా నవ్వి అంది మాధవి.

కిటికీ దగ్గర నిల్చుని దూరంగా చూస్తున్న సుజన తల తిప్పి ప్రశ్నార్థకంగా చూసింది - ఏవి టన్నట్లు.

మాధవి సుజన ముఖంలోకి చూస్తుండి పోయింది. కొన్నిక్షణాలు మాట్లాడక

"ఏమంటున్నారు?" అంది విచలిత



స్వరంతో మాధవి కళ్ళలోకి గ్రుచ్చి గ్రుచ్చి చూస్తూ.

"'సుజన అలా ఉందేం? ఈ పెళ్ళి ఇష్టంలేదా?' అని" పేలవంగా నవ్వుతూ అంది

"ఊఁ...ఏం చెప్పావు?" బలహీనంగా నవ్వి అంది.

"'ఎందు కిష్టంలేదూ? ఇష్టమే' అని చెప్పాను" నేలచూపులుచూస్తూ అంది.

సుజన బరువుగా నిశ్వశించి — "నమ్మారా?" అంది శాశ్వతస్తమైన కళ్ళను మాధవి కళ్ళల్లో పడనీకుండా తల తిప్పుకుని.

"ఎవరు నమ్మారో నమ్మలేదో నాకు తెలీదు గానీ, మీ ఆడబడుచు మటుకు నమ్మలేదు"

"ఏమందేమిటి?" తలతిప్పి ఆత్రంగా అంది.

ముఖం కొద్దిగా వాలిపోయింది పెదవులు వొణికాయి.

"ఇష్టమే అయితే పెళ్ళి రోజున ఇంతటి శుభసమయాన కళకళ్లాడవలసిన ముఖం అలా కళావిహీనంగా ఉందేం?" అని నిలదీసి మరీ అడిగింది

"సుజా! మీ ఆడబడుచు తక్కువైందేమీకాదు. మానవ మనస్తత్వపు లోతులు కరతలామలకాలు. ప్రస్తుతం సైకాలజీ ఎమ్. ఎ. చేస్తుందట."

"తెలుసు" బరువుగా నిట్టూర్చి అంది

గొంతు పెగుల్చుకుని ఒక్కమాటా బయటకు రాలేదు.

"నీకీ పెళ్ళి ఇష్టంలేదని నాకు మటుకే తెలుసు అయితే, నీ ప్రియాతి ప్రియమైన మాధవి హృదయంలో ఈ



కొన్ని క్షణాలు మౌనంగా జరిగి పోయాయి.

''సుజా!''

తల త్రిప్పుకొన్న సుజన మాధవి కంఠంలోని ఆర్ద్రతకు చలించిపోయింది.

ఎందుకు పిలిచావని అడగలేక పోయింది

రహస్యం గుప్తంగా ఉంటుం దన్న విషయం మటుకు ఏ క్షణంలోకూడా మరచిపోవద్దు'' విచలిత స్వరంతో అంటుంటే, కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి

"మాధవీ!" కుర్చీలో కుప్పగా కూల బడి దోసిట్లో ముఖం దాచుకుని విలవి ల్లాడింది సుజన

"ఒక్క విషయం చెప్పాలనుకుంటు న్నాను నువ్వు దా న్నెలా స్వీకరిస్తావో తెలీదు. మన ప్రగాఢ స్నేహలతను దృష్టిలో పెట్టుకునే ఈ సలహా ఇచ్చేందుకు సాహసిస్తున్నాను " మెల్లగా అంది.

సుజన దోసిట్లోనుండి తలెత్తి చూసింది కన్నీటి ధారలచే చెంపలు మలినమయ్యాయి దీనత్వమూ, నిస్సహాయతా రూపుగొన్నట్లున్న సుజనను చూడగానే, మాధవి కన్నుల్లోనుండి నీటి బొట్లు జలజలా రాలాయి.

"సుజా! ఈ సమయంలో నీకు కావలసింది మనోధైర్యం అది నీ కుందనే నా అభిప్రాయం " చెక్కిళ్ళమీద జారిన కన్నీటిని తుడుచుకుంటూ అంది.

అందుకు సుజన ఎలాంటి జవాబూ చెప్పలేక శూన్య దృక్కులతో శూన్యాకాశం కేసి చూడసాగింది

"జీవితం చిత్రమైంది. అనుకున్నవేవీ అనుకున్నట్లు జరగవు ఏ అదృష్టవంతులకో ఆ వరం పరిమితం మన లాంటివాళ్ళం ప్రతిక్షణం ఈ జీవితంలో పోరాడాలి ఎవర్నో సుఖపెట్టాలనీ సంతోషపెట్టాలనీ ఈ పెళ్ళికి వొప్పుకున్నావు అదే నీలక్ష్యమైతే దాన్ని చేరుకొనే మార్గం తప్పక చూడాలి " సుజన ముఖంలోకి పరిశీలనగా చూస్తూ అంది

"అలాగే మాధవీ! ఇక నాముఖంలో ఒక్క బాధావీచికను నువ్వు చూడవు" కన్నీటిని పూర్తిగా తుడుచుకొని మెల్లగా నవ్వి అంది

"చిన్నతనంలోనే, అమాయక లేత హృదయాల్లో ఆశాలతలను ఎంతో జాగ్రత్తగా, ప్రేమగా పెంచి పెద్దచేస్తే విధి అనే ఝంఝూనిలయం వాటిని సమూలం పెకిలించివేసినప్పుడు మానవు డేంచేస్తున్నాడు? ఆ నిరాశతో ఆ దుఃఖంలో అలాగే కుమిలిపోతున్నాడా? తనజీవితంతోపాటుతనవారి జీవితాల్లోనూ నిరాశాకారుచిచ్చును రగిలిస్తున్నాడా? 'అంతకంటే చేసేదిమటు కేముంది?' అని నువ్వనవచ్చు కానీ, వివేకవంతులు, విజ్ఞానవంతులు చేయవలసిన పని అదేనా సుజా?

"వినూత్నమైన ఆశాలతలను తిరిగి నాటి, పెంచడం వివేకం కాదంటావా?

"ఏనాటికైనా అవి పుష్పించి మనోహర సౌరభాలను వెదజల్లుతాయని జీవిత మంతా నిరీక్షించడం, జీవితానికే జీవమైన ఆశావాదానికి నిదర్శనం కాదంటావా? విధి చేతిలో పరాజయాన్ని స్వీకరించి చేతకానితనాన్ని నిరూపించుకోవడం కన్నా ఉన్నశక్తి నంతా కూడదీసుకుని విధినే ఎదిరించడం సాహసం కాదంటావా?" ఆవేశంగా అంటున్న మాధవి ఒక్కక్షణం ఆగి, సుజన ముఖంలోకి చూసింది ఫలితంకోసం.

సుజన ముఖంలో రంగులు మారాయి



"ఆ కోతిలా ఉండే ఆవిడకి కుడివైపున ఉన్న ఆవిడా
ఎడమవైపున ఉన్న ఆవిడా మీ ఆవిడ ?"
"ఆ మధ్య నున్నదే."

పెదవులమీద సన్నని చిరునవ్వు తళుక్కు మంది.

ఆశాపూరిత నేత్రాలతో మాధవి ముఖంలోకి చూస్తూ కూర్చుంది—ఏం మాట్లాడక.

"పెళ్ళి పందిరిలో నువ్వు క్షణక్షణం కళ్ళెత్తి చూస్తుంటే..."

"మాధవీ!" విచలిత స్వరంతో అంది.

"నీ పిచ్చిగానీ, అత నెందుకొస్తాడు? అంత మమకారమే ఉంటే..."

"దయచేసి గతంలోని ఏ క్షణాన్నీ గుర్తు చేయకు. అది నాకు చిత్రహింసనే భావించు మాధవీ" తలతిప్పుకుని అంది.

ఎంతో విశ్చలంగా, నిర్వికారంగా చెప్పాలనుకున్నా. ప్రతిమాటా బాధా పూరితమై, హృదయానికి ప్రతిబింబమే అయింది.

ప్రేమను నిర్వచించడం నా శక్తికి అతీతమైన పని అయినా నిజమైన ప్రేమ అన్ని అడ్డంకులనూ తొలగించు కొని యథేచ్ఛగా తన గమ్యాన్ని చేరుతుందని చెప్పడం సత్యానికి దూరం కాదేమో! నువ్వు చేసిన తప్పు ఒక్కటే ననిపిస్తుంది."

"ఏమిటి?" తల తిప్పి కాస్త ఆశ్చర్యంగానే ప్రశ్నించింది.

"ఒక పిరికివానికి మనసివ్వడం"

సుజన గాఢంగా నిట్టూర్చడం తప్ప మరేం జవాబు చెప్పలేకపోయింది.

పొంగి పొరలుతున్న కన్నీటిని మాధవి దృష్టినుండి తప్పించుకొనేం దుకు అక్కడనుండి లేచి వెళ్ళడమే శరణ్యమైంది.

"అవును పొరబడ్డాను" అంది గద్గద కంఠంతో

"గతాన్ని మరచిపోవాలని నువ్వు ఎంతగా ప్రయత్నించినా అదంత సులభ మైన పనేమీ కాదు ఎంతో మనో నిశ్చ యం, ధైర్యమూ కావాలి తీవ్రమైన సాధనా, కృషీ అవసరం. అయినా, విజ్ఞానవతివి, వివేకవతివి నీకు చెప్ప వలసిన అవసరం లేదు. నేను వెళ్తాను. కాసేపు విశ్రాంతి తీసుకో. గతంలో కూలిన ఆశాసౌధాలను గురించి ఆలో చిస్తూ బాధపడకు సుందర భవితవ్య సౌధానికి సోపానాలు కట్టుకో సుజా! ఇక వెళ్ళనా?" అని, కుర్చీలోనుండి లేచి సుజన దగ్గర కెళ్ళి తల తనవేపు తిప్పుకుంది.

బాష్పపూరితాలైన కళ్ళనెత్తి మాధవి ముఖంలోకి చూడలేకపోయింది సుజన

"ఇది న్యాయంకాదు సుమా.. "

కాస్త కఠినంగానే అంది మాధవి

"కొన్నిగంటలవ్యవధి నివ్వుమాధవీ? ఈ పరిస్థితులకు కాస్త నన్ను. " రుద్ధ కంఠంతో అంది

"అలాగే. అలాగే. నే వెళ్తాను" అంటూ మాధవి వెళ్ళిపోయింది

భార హృదయంతో బరువెక్కిన మెదడుతో మంచంమీద వాలిపోయింది సుజన. గత స్మృతులు ఝుమ్మంటూ ముసురుకుంటున్నాయి. దూరం చెయ్యా లని ప్రయత్నించినా ప్రయోజనం లేక పోయింది

వేణు...తన జీవితంలో వేణుప్రవేశం ఇంత విషాదకరమైనస్థితికి దారి తీస్తుం దని ఎవ రనుకున్నారు?

ఆ రోజు... తనకు బాగాగుర్తు — క్లాసులో అందరూ ఇంగ్లీషు లెక్చరరు కోసం వేయి కన్నుల్తో ఎదురు చూస్తు న్నారు. తన గుండె లెందుకో వేగంగా కొట్టుకుంటున్నాయి ఎన్ని మార్కు లొస్తాయో నని — బాగా వ్రాసినా ఎందుకో అంత ఆత్రం! భయం? ఈ రోజను కుంటే నవ్వొస్తుంది. 'ఫస్టుమార్కు నీకేలే' మెల్లగా గొణిగింది మాధవి.

తను చురుక్కున చూసింది మాధవి కన్నుల్లోకి — పరిహాసమెందు కన్నట్లు.

'అంత పరిహాసమెందుకూ? నా మాట తప్పదు చూడు!' అంది మాధవి మెల్లగా నవ్వి, తలతిప్పుకుంటూ.

క్లాసులో గోల ఎక్కువైంది

ఈలలు, పాటలు, నవ్వులు — వీటిలో తరగతిలాకాక బజారులా తయారయింది డిగ్రీక్లాసు కొచ్చారన్న పేరేగానీ, చదు వుకు తగిన సభ్యతా, శిక్షణా, మర్యాదా లేనేలేవు

పిల్లి కూతలుకూడా వినిపిస్తుంచే తనకు చిరాకెత్తుకొచ్చింది— 'బుద్ధితక్కువై కూర్చున్నాం. పోదాం పద. మేనర్‌లెస్ బ్రూట్స్' కోపంతో కంపిస్తున్న స్వరంతో అంది.

'రెండుమూడు నిముషాల్లో పోవటం రావడ మెందుకని? అందులో పేపర్లిస్తా రాయె... అరుగో మాస్టారొస్తున్నార్లె.' సర్ది చెప్పింది మాధవి.

ఎదురుచూస్తున్న మాస్టరు రానే వచ్చారు.

తన గుండెలు మరీ విపరీతంగా కొట్టుకోసాగాయి.

మాస్టరు పేపరుకట్ట విప్పుతూ, క్లాసు వేపు చూసి చిరునవ్వు నవ్వి –

'సుజన ఫస్ట్, వేణు సెకండ్' అన్నారు.

మాధవి చేతిమీద మెల్లగా గిచ్చింది.

తనగుండెదడ అప్పటిగ్గానీ తగ్గలేదు!

అందరికీ పేపర్లిచ్చాక – 'ఒకసారి ఎలా వ్రాసారో చూసుకోండి' అన్నారు మాస్టరు.

అర్ధసంవత్సరంగా ఒకే క్లాసులో ఉన్నా వేణెవరో అసలు తనకు తెలియక పోవడం కించిత్తు ఆశ్చర్యాన్నే కలిగించింది. పేపర్లిచ్చేటప్పుడు సలుగురైదుగురు గుంపుగా రావడంచేత వేణు ఎవరో తెలుసుకోలేకపోయింది.

అంతలో క్లాసు మధ్యలో నుండి సన్నగా, పొడుగ్గా ఉన్న యువకుడు పేపరు చేత్తో పట్టుకుని లెక్చరర్ దగ్గర కొచ్చాడు.

'ఏం వేణూ?' ఆ అబ్బాయి వేపు చూస్తూ ప్రశ్నించాడు లెక్చరరు.

అప్పటకి తెలిసింది అతనే వేణని.

'వారి పేప రిప్పిస్తారా?' అన్నాడు నేలచూపులు చూస్తూ మెల్లగా.

''ఎవరి పేపరు?''

"వారిదే...సుజనగారి పేపరు"

అస్పష్టంగా గొణిగాడు. ఆ గొణుగుడు లెక్చరర్‌కు, లెక్చరర్‌కు దగ్గరగా కూర్చొనున్న తమకూ మటుకే వినిపించిఉంటా యనిపించింది తనకు.

ఎంత భయస్తుడు! తనకు నవ్వొచ్చింది.

వేణు అలా అడగ్గానే లెక్చరర్ ముఖం ఎందుకనో కొద్దిగా పాలిపోయింది.

అయినా కొద్ది క్షణాల్లో తన్ను తాను సంబాళించుకుని "ఎందుకూ?" అన్నారు.

"ఎంత బాగా వ్రాసారో చూద్దామని"

అస్పష్టంగా అన్నా, ప్రతి పదంలో వ్యంగ్యం నిగూఢంగా ఉన్నట్లనిపించింది తనకు.

కోపం ఉప్పెనలా పొంగింది. ఆడపిల్లలు ఏవిషయంలోనన్నా కాస్త ఆధిక్యత చూపితే ఎందుకో ఈ మగవాళ్ళు ఓర్చుకోలేరు? ఒకసారి మాధవికి పద్య రచనా పోటీలో మొదటిబహుమతి వస్తే ఇలాగే హృదయాల్లోని మాలిన్యాన్నంతా

బయటపెట్టుకున్నారు! ఆడపిల్ల వ్రాసిందని మొదటి బహుమతి ఇచ్చారట!

హూ...ఎంత నైచ్యం, ఎంత సంకుచితత్వం! కొన్ని విషయాల్లో ఆడవాళ్ళు తమకన్నా అధికులని అంతరాంతరాల్లో స్పష్టంగా విదితమైనా బయటకు మటుకు వచ్చినా ఒప్పుకోరుకదా? తను వ్రాయందే మాస్టరు తనకు మార్కు లిచ్చారా?

ఎందుకిస్తారు?

ఆడపిల్లనా లేక మరేదన్నా...అవమానంతో సిగ్గుతో కళ్ళల్లో నీళ్ళు చిప్పి



ల్లాయి. రోషంతో, కోపంతో హృదయంలో అగ్నిజ్వాలలు భగ్గుమన్నాయి.

'చూడమనండి మాష్టారూ!' అంది పేపరు మాస్టరి చేతి కందిస్తూ.

మాస్టరు ముఖంలోన్నూ అనేకభావాల రంగులు మారాయి.

వేణు నెమ్మదిగా పేపరు తీసికెళ్ళి

తనసీట్లో కూర్చొని పది నిముషాల తర్వాత తిరిగివచ్చి పేపరు మాస్టరిచేతి కిస్తూ 'చాలాబాగా వ్రాశారు' అన్నాడు. — ధైర్యంగా తన ముఖంలోకిగానీ, మాస్టరు ముఖంలోకిగానీ చూడలేక, నేలచూపులు చూస్తూ.

'వ్రాయబట్టే ఫస్టుమార్కులొచ్చాయి' అన్నారు కరుగ్గా మాస్టరు.

'అవును' మెల్లగా అని వెళ్ళిపోయాడు.

ఆ అవరు పాఠాలేం జరగలేదు.

'చాలా బాగా వ్రాశారు' అన్న వేణు మాటలే తన చెవుల్లో పదే పదే మారు మ్రోగుతున్నాయి.

ఏదో పేచీ తెస్తాడనుకున్న వేణు అంత సౌమ్యంగా, ఇతర్ల గొప్పతనాన్ని గుర్తించడం తనకు సంతోషాన్నే కలిగించింది.



మంచితనాన్ని, గొప్పతనాన్నిగుర్తించడం, శ్లాఘించడం ఈ రోజుల్లో అరుదుగా కనిపిస్తున్న విషయం.

వేణు అనే విద్యార్థి తన తో పాటు చదువుతున్నాడన్న విషయం అంతవరకు తెలియకున్నా ఆ రోజునుండీ హృదయంలో ఏదోమూల తనకు తెలీకుండానే స్థానాన్ని ఆక్రమించుకున్నాడు.

ఇది తనకు తెలీకుండానే జరిగిపోయిన విషయం

క్లాసుకు వెళ్ళగానే, తనకళ్ళు నెమ్మదిగా, సౌమ్యంగా ఏదో చదువుకుంటూ తన ఉనికే ఇతర్లకు తెలియనట్లుండే వేణునే వెదికేవి

ఒక్కోసారి భయంగా, సిగ్గుగా తన కళ్ళల్లోకి చూస్తున్న సన్నవి, కాంతివంతమైన కళ్ళతో తన కళ్ళు కలిసేవి

అలాగ మాటలే లేక చూపుతోనే ఆ సంవత్సరం జరిగిపోయింది.

రెండో సంవత్సరం—

ఎప్పుడూ ఇంగ్లీషులో తనకే వచ్చే ఫస్టుమార్కు వేణుకు పోయింది

ఆ సంవత్సరమూ, మెల్లగా ఎలాంటి ప్రత్యేకత లేకనే జరిగిపోయింది.

మూడో సంవత్సరం తన జీవితంలో మరువరానిది, ఉష ... మరచి పోవాలని ఇన్ని రోజులుగా ప్రయత్నిస్తున్న కాలం

అంతవరకు వేణు మీద ఉన్న అవ్యక్తమైన అభిమానం ఒక రూపాన్ని ఏర్పరుచుకొంది.

వేణు వ్రాసిన చిన్న ఉత్తరం ఆ రూపానికి ప్రకాశానికొచ్చే మార్గదర్శి అయింది

తన సుందర మానస సరోవరంలోని ప్రఫుల్ల ప్రేమ పంకజం సుగంధాలనూ, అందాలనూ వెదజల్లసాగింది

ఆ సుగంధ వీచికలూ, అందాల మేఘమాలికలూ తనను సరిక్రొత్త లోకాలకు తీసికెళ్ళుంటే,

మాధవి వేళాకోళం చేస్తూ—

'సుజా! ఎప్పుడూ ఊహా లోకమైతే ఎలా? కాస్త భూమ్మీద నడు!' అనేది

దాంతో కెంపురంగును పులుముకొన్న తన చెక్కిళ్ళలోని అరుణిమనూ, కన్నుల్లోని కాంతులనూ చూసి మాధవి మరింత హాస్యం చేస్తూ—

'ఆ పిరికివాడి నెందుకే, అలా హీరోలా ఆరాధిస్తావు?' అనేది

'అతను పిరికివా డేంకాదు. మంచివాడు' అనేది చూపులు త్రిప్పుకుంటూ, వచ్చేనవ్వును బలవంతంగా అపుకుని

ఒకరి భావాల నొకరు అర్థంచేసుకున్నా, ఒకచోట కూర్చుని మనసారా మాట్లాడుకున్నది లేదు

క్లాసులోనే కళ్ళు మౌనంగా తమ మూగభాషను మాట్లాడుకొనేవి

పబ్లిక్ పరీక్ష లయ్యాక, వేణుఉత్తరం వ్రాసాడు - వెళ్ళేముందు ఒక సారి కలుసుకుని మాట్లాడా లనీ, అందుకు తగిన అవకాశాన్ని కల్పించమనీ -

మాధవీ, తనూ కలసి పార్కుకు వెళ్ళారు.

ఆరోజే మొదటిసారిగా తన కుటుంబ విషయా లన్నీ చెప్పాడు వేణు

తను సనాతన బ్రాహ్మణకుటుంబంలో నుండి వచ్చినవాడైనా బ్రాహ్మణేతర కన్యను వివాహం చేసుకొనేందుకు ఎలాంటి అభ్యంతరమూ లేదన్నాడు

అమ్మా, నాన్నలు ఒప్పుకోకున్నా, ఒప్పించగల ధైర్య ముందన్నాడు

తనూ, ఇద్దరు చెల్లెళ్ళూ తమ తల్లి దండ్రుల సంతాన మనీ, తను గారాబాల కొడుకు కాబట్టి తన ముద్దు తప్పక చెల్లిస్తారన్న ఆశ ఉందని నొక్కి చెప్పాడు

వెళ్ళగానే అన్ని విషయాలూ మాట్లాడి ఉత్తరం వ్రాస్తా నన్నాడు

వేణు చెప్పిన ప్రతిమాటనూ తను నమ్మింది. మాధవి ఏవో అనుమానాలను వెల్లడించి, వేణును క్రాస్ ఎగ్జామిన్ చేసింది.

వేణు ఏ మాత్రం చలించలేదు అన్నిటికీ నెమ్మదిగా జవాబులు చెప్పాడు

సెలవు తీసుకునే ముందు అప్రయత్నంగానే తన కన్నుల్లో నీళ్ళు చిప్పిల్లాయి

మాధవి నాలుగడుగులు ముందు కెళ్ళింది — తమకు ఏకాంతాన్ని కల్పించా లన్న ఉద్దేశంతో,

'నీ ఉత్తరంకోసం వేయికన్నుల్తో ఎదురు చూస్తుంటాను వేణూ! నీఉత్తరం వచ్చాకే నాన్నతో అన్ని విషయాలూ మాట్లాడ్తాను ఉత్తరం వ్రాయడం మరచి పోకేం?' అని అంటుంటే కంఠం వొణికింది

ఈ అమంగళానికి అపస్వరాలు ఆరోజే పలికాయేమో అనిపిస్తుంది తనకు

లేకుంటే తన కంఠం అంతగాచలించ వలసిన అవసర మేముంది?

'అలాగే సుజనా! ఉత్తరం వ్రాయడం ఎలా మరచిపోతాను? అలా జరిగితే నన్ను నేను మరచిపోయినట్లు కాదూ?' నవ్వుతూ తన కళ్ళ ల్లోకిచూసి అంటుంటే, తన గుండెలమీదనుండి ఏదో పెద్దబరువు తొలగిపోయినట్లు తేలిగ్గా శ్వాస తీసుకుంది. కానీ, ఈ రోజు జరిగింది?

వెచ్చని కన్నీరు పొంగి చెంపలి మీదుగా జారింది

వొణుకుతున్న చేత్తో కన్నీటినితుడిచి ప్రక్కకు తిరిగి పడుకుంది సుజన.

హృదయంలో ఎవరో చెయ్యి పెట్టి దేవినట్లు సుడులు తిరుగుతున్నబాధ

ఒక పిరికివాణ్ణి, వంచకుణ్ణి గురించి తనెందుకింత ఆలోచించాలి? బాధపడాలి? అదే అర్థం కాలేదు సుజనకు

కుసుమసాదృశ మైన హృదయాన్ని నిర్దాక్షిణ్యంగా నలిపి వేసిన కఠినుడు... అవును... ప్రతిక్షణం వొళ్ళంతా కళ్లు చేసుకుని, ఆశగా అతని ఉత్తరంకోసం ఎదురుచూడలేదూ? హూ...చివరకు మిగిలింది? కల లన్నీ రూపమే లేకుండా కరిగిపోయాయి. జీవితంలో తనను మరచిపోలే నన్నవాడు చివరకు ఒక ఉత్తరం వ్రాయనే మరచిపోయాడు!

రోజులు, నెలలు అతని ఉత్తరం కోసం ఎదురు చూసింది.

ఆత్మాభిమానాన్ని చంపుకుని ఉత్తరం కూడా వ్రాసింది. దానికి జవాబు లేదు. మానసిక క్షోభతో సంవత్సరం రోజులు అతి భారంగా జరిగిపోయాయి.

ఇంట్లో సంబంధాలు చూడసాగారు. విజయకుమార్ వచ్చి చూసి పెళ్ళిచేసుకొనెందుకు ఇష్టపడ్డాడు.

దాంతో, అది మంచి సంబంధమనీ, తప్పకుండా ఒప్పుకోవా లనీ, ఇంట్లో ఒత్తిడి ప్రారంభమైంది.

నాన్న దగ్గరకూర్చోబెట్టుకుని పరిస్థితి వివరించి చెప్పారు.

పోనీ, ఎవరినన్నా చేసుకోవా లని మనసులో ఉంటే దాపరికం లేకుండా చెప్పమన్నారుకూడా.

కానీ, ఏం చెప్తుంది తను?

మనసిచ్చినవాడూ, నమ్ముకున్నవాడూ మోసం చేసినప్పుడు? పిరికివాడై ముఖమె చూపలేక పరిగెత్తి పారిపోతున్నప్పుడు?

చివరిసారిగా ఇంకో ఉత్తరం వ్రాసింది—

పెళ్లికి ముందే వచ్చినట్లయితే......

ఉండు...ఇవన్నీ ఎందుకు? ఈ ఆలోచనల వల్ల లాభ మేంటి?

ఇక తనకు గతం లేదు.

అవును.........

భారంగా నిట్టూర్చి, బరువుగా కళ్ళు మూసుకుంది సుజన.

* * *

తలుపు తట్టిన చప్పుడుకు ఉలికిపడి కళ్ళు తెరచి చూచింది సుజన.

మనసు ప్రశాంతంగా ఉంది-తుఫాను వీచి, ఆగిపోయిన తర్వాత ఏర్పడే ప్రశాంతంలా చూపులు త్రిప్పి కిటికీలోనుండి దూరంగా చూసింది.

రమణీయమైన సంధ్యా, అంతకన్నా మనోజ్ఞమైన ప్రాచీకన్నె ముఖారవిందం, చల్లని పిల్ల తెమ్మెరలూ, మనసును నూతన ఉత్సాహంతో, ఆనందంతో నింపాయి.

'ఎంత సేపు నిద్రపోయాను!' అనుకుని తన నిద్రకు తనే ఆశ్చర్యపోయింది.

తిరిగి తలుపు మెల్లగా తట్టిన చప్పుడయింది.

"ఎవరు? మాధవీ?"

"కాదు"




"ఈయన కారు బాగానే ఉంది...మరి అమ్మతోటి ఈయన దొక్కు[redacted]
డంటా వేమిటి ?''

అంతో మెల్లగా వినిపించింది సుపరిచిత కంఠం.

ఆశ్చర్య పోయి, మంచం మీద నుండి లేచి తలుపు తీసింది సుజన.

వాకిలి దగ్గర నిలబడి ఉన్న వ్యక్తిని చూడగానే కొన్ని క్షణాలపాటు అచేతనయై చిత్తరువులా వుండిపోయింది.

"ఆహ్వానం లేకుండా వచ్చానని ఆశ్చర్యపోతున్నావా సుజనా ?"

ఆ మాటలతో సుజనలో చలనం కలిగింది. దుఃఖం, కోపం, భయం, కలగాపులగంగా హృదయాన్ని ఆక్రమించాయి.

తల తిప్పుకొని రెండడుగులు వెనక్కు వేసింది.

"లోపలకు రావచ్చా ?"

"అసలు నువ్వెందుకొచ్చావు ? నేనిక్కడున్నానని ఎలా [redacted] ఆందోళనా స్వరంతో అంది.

అదృష్టవశాత్తూ రాగానే వ[redacted] కనిపించింది. అరగంట సేపు [redacted] లాడించుకొని చివరకు దారి చూపి[redacted] ఒకే ఒక మాట మాట్లాడి పోదామని వచ్చాను. కాదనకు" ప్రార్ధనా పూర్వకంగా అన్నాడు.

"ఏముఖం పెట్టుకుని వచ్చావు ?"

దుఃఖం వల్లా, కోపం వల్లా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

గొంతు గాద్గద్యం వహించింది.

శాంతించిదనుకున్న తుఫాను తిరిగి చెలరేగి. మనసును నానా భీభత్సంగా తయారు చేసింది.

వర్తమానంలోనే కాక, భవిష్యత్తులో కూడా తనకోసం అలాంటి విషమ ఘడియలు ఎదురు చూస్తుంటాయని కల లోనైనా ఊహించని సుజనకు, ఆ పరిస్థితికి తట్టుకని నిలబడడానికి శక్తికి మించిన పనే అయింది

"అంత కఠినంగా మాట్లాడకు సుజనా! నీమీద ఎన్నో ఆశలు పెట్టుకుని వచ్చాను ఒక్క నిమషం — ఒకే మాట"

"ఏవి...

తల గిఱ్ఱున తిరుగుతున్నట్లే ఉంది సుజనకు "భగవాన్ ఎందుకు నాకీ పరీక్ష పెట్టావు తండ్రీ? ఈ పరీక్షలో నెగ్గేందుకు తగిన ఫలాన్ని నా కివ్వు లేకుంటే నా ప్రాణాలే తీసుకో జీవన గ్రంధంలో నుండి గతానికి సంబంధించిన అధ్యాయాల నన్నింటిని చించివేసి, సరికొత్త అధ్యాయాలను వ్రాయా లనుకుంటున్న సమయంలో తిరిగి నేడు ప్రత్యక్షం కావడంలో అర్థం? తన జీవితం ఏం కాబోతుంది ఏమిటి దీని పరిణామం?

త నెందుకింత బేల అయింది? ఎందుకిలా ఆలోచిస్తుంది?

"నన్ను క్షమించు సుజనా!''

కన్నీటి పొరగుండా వేణు వే పు చూస్తూ, బరువుగా నవ్వి,—"క్షమించాను'' అంది.

"నిజంగానా?"

ప్రఫుల్లవదనంతో అన్నాడు, హృదయంలోని సంతోషం, కన్నుల్లో, పెదాల మీదా చిరుహాస్యం చేసింది.

అంతవరకు సుజన ముఖంలోకి సూటిగా చూసే ధైర్యం లేనివాడు, ఆ మాటతో తలెత్తి ధైర్యంగా చూశాడు.

"అమ్మా నాన్నలతో నిన్ను పెళ్ళి చేసుకుంటానని చెప్తే, కులం ప్రస్తావన తెచ్చి నా నోరు నొక్కేసారు. వాళ్ళను ఎదిరించే ధైర్యం లేకపోయింది వాళ్ళ కన్నీరు చూసి మూగవాడినైపోయాను నే నొట్టి పిరికివాడిని సుజనా! ఏమీ చెయ్యలేక, చెయ్యను చేతగాక, అంతా ఆ విధికి వొదిలి ఊరకుండిపోయాను రెండు రోజులక్రితమే నా పెట్టెలో ఉన్న నీవు వ్రాసిన ఉత్తరాలు చదివింది చెల్లి కన్నీటితో. నన్ను వెళ్ళమని ప్రార్థించింది. మనసిచ్చి నమ్ముకున్న స్త్రీని మోసం చెయ్యవద్దంది. చెల్లి నా ఉత్తరాలు చదవడం తటస్థపడకపోయినట్లయితే, ఆ చీకటిలోకాల్లోనే కర్తవ్య పథం కనుపించక గ్రుడ్డివాడినై ఈ రోజుకూ అలమటిస్తూ ఉండేవాడినేమో?''

"ఈ రోజుకు కళ్ళు తెరిచావా? హు...ఏంప్రయోజనం? చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే లాభం లేదని తెలీదూ?" బరువుగా, వ్యంగ్యంగా అంది.

అలా గనకు సుజనా! ఇప్పుడు మునిగిపోయింది మటుకేముంది? పెళ్ళయి కొన్ని గంటలుకూడా కాలే




"అదేవిటోనండీ—అదే కథ, అదే మ్యూజిక్కూ, అదే క్లయిమాక్సూ—అదే స్టార్లూ పెట్టి, పేరు మాత్రం మార్చితీశా సుమండీ — మొదటి పిక్చరు శత దినోత్సవాలు చేసుకుంది — మరి ఇది ఫ్లాప్ అయి కూచుంది — ఏవిటో ఈ ఆడియన్సు పద్ధతి అర్థం కాటంలేదు."

---

దుగా ?" ఆశగా సుజన ముఖంలోకి చూస్తూ అన్నాడు.

"అరుగంట లయింది!" చూపులు త్రిప్పుకొని హేళనగా అంది.

"మనసులేని మనువుకన్నా నరకం మరొకటి లేదు పెళ్ళయిందనేందుకు మంగళసూత్రం ఒక బాహ్య చిహ్నం మటుకే దానికి మనం లేనిపోని ఆధిక్యతనూ, విలువనూ, పవిత్రతనూ అంట గట్టున్నాము. మనసులు కలవని పెళ్ళి పెళ్ళేకాదు. అలాగని ఎవరూ చెప్పరు కూడా. అయిష్టంగా జరిగిన ఈ పెళ్ళిలో పవిత్రతా, ఔన్నత్యమూ ఎక్కడున్నాయి, నువ్వు నాతో వచ్చేస్తే నేం సుజనా ? మనం మళ్ళి పెళ్ళిచేసుకుందాం "

ఆమాటతో సుజన నిలువెల్లా వణికి పోయింది



కళ్ళూ, చెక్కిళ్ళూ ఎరుపురంగును పులుముకున్నాయి.

రెండుసార్లు మాట్లాడాలని ప్రయత్నించింది. కానీ, గొంతు పెగలనేలేదు.

కొన్నిక్షణాల తర్వాత తన్ను తాను సంబాళించుకుని —

"నువ్విక్కడనుండి ఎంత త్వరగా వెళ్ళిపోతే అంతమంచిది" కఠినంగా, గంభీరంగా అంది.

"నువ్వు నన్ను నిజంగా ప్రేమించినట్లయితే..." అస్పష్టంగా అని అర్ధాంతరంగా ఆగిపోయాడు.

"నిజంగా ప్రేమించినట్లయితే సీతో వచ్చేస్తాను ?" హేళనగా నవ్వి అంది.

వేణు చూపులు త్రిప్పుకుని — "జీవితాంతం నరకంలో ఎలా ఉంటావు సుజనా ? నీ నిర్ణయం మీదనే మనిద్దరి సుఖ సంతోషాలు ఆధారపడి ఉంటాయన్న విషయం మరచిపోకు" తప్త కంఠంతో అన్నాడు.

"నరక మని ఎందుకనుకుంటూ వున్నావు ?" నిర్వికారమైన కంఠంతో అంది.

"అయిష్టంగా చేసుకున్న పెళ్ళిలో స్వర్గ మెలా ఉంటుంది ?"

"అయిష్టంగా చేసుకున్నా నని ఎలా చెప్పగలవు ?" అదోరకంగా నవ్వుతూ అంది.

"ఇష్టపడే చేసుకున్నావా?" ఆశ్చర్య పోతూ అడిగాడు.

"అవును"

"నేను నమ్మను."

"నమ్మమని ఎవరన్నారు" సన్నగా నవ్వుతూ అంది.

వేణుముఖం పాలిపోయింది. కొన్ని క్షణాల తర్వాత రుద్ధకంఠంతో —

"నా పిరికితనమే ఇంత పొరపాటుకు కారణ మని ఒప్పుకుంటాను. కానీ..."

సుజన మధ్యలోనే అందుకుని — "వివాహ వ్యవస్థలో నీకు నమ్మకం లేక పోవచ్చు. కానీ, నాకు నమ్మక మే కాదు— గౌరవంకూడా ఉంది. నువ్వనుకున్నంత సులభంగా తెంచుకుని వచ్చే బంధంకాదు వివాహబంధం. తెంచలేని పవిత్రబంధం. అందుకనే కాలాన్ని అధిగమించి సజీవంగా ఉంది ఈ రోజుకూ. మరొకవ్యక్తి జీవితాన్ని పంచుకుంటున్నా నని, పదిమంది పెద్దల ముందు ప్రమాణం చేశాను. అతని ఆశలనూ, కోరికలనూ నాశనం చేసి, బంగారు భవిష్యత్తులో ముళ్ళునాటి నీతో ఎందుకు రావాలి నేను ? అతను చేసిన తప్పేంటి ? నువ్వు చేసిన తప్పుకు, నీ పిరికి తనానికి అతన్ని శిక్షించనా ? ఈ రోజు నీతో వచ్చేస్తే అతని భవిష్యత్తేంటి ? జీవితం మీద ఎంత విరక్తికలుగుతుంది. ఎంతగా, కుమిలిపోతాడు ? ఈ నీ సాహసం ఏ విధంగానూ లాభకరం కాదు. ఇది ముందే ఉండవలసింది. నేను రాను, నువ్వు వెళ్ళు" గంభీరంగా, కఠినంగా ఒక్కో మాటే అని, కిటికిలోనుండి ఆకాశంలోకి నిశ్చలంగా చూస్తూ నిల్చుంది.

వేణు మెల్లగా అక్కడనుండి వెళ్ళాడు.

"సుజనా !" మాధవి లోపలికి వచ్చి సుజన భుజం మీద చెయ్యి వేసింది.

"మాధవీ !........."సుజన ఏదో చెప్పబోయింది.

"ఏం చెప్పనక్కర్లేదు. నే నంతా విన్నాను. మంచిపని చేశావు సుజనా ! ఈ సమస్య కంతకంటే చక్కని పరిష్కారం లేదు. ఒకరి తప్పుకు మరొకర్ని శిక్షించడం న్యాయం కాదు."

"అవును. ఇక, క్రిందకు వెళ్దాం పద" అంటూ మాధవి చేతిని తన చేతిలోకి తీసుకుంది సుజన.

---




ప్రజేశ్వరుడు వచ్చాడు. ఉగ్రుడైన తంత్రీహరివల్లభుడు ఎదుట నిలబడ్డాడు. కాని ఎందుకా ఏమిటీ అని ఏమీ అడగలేదు.

"అబ్బాయీ! నీకు ఎన్ని పెళ్ళిళ్ళు అయినాయో తెలుసునా?"

"తెలీదు."

"మూడు. నీకు మూడు పెళ్ళిళ్ళయినాయి. తెలిసిందా? నీ మొదటిభార్య ఎవరో తెలుసా?"

"తెలీదు."

"అది ఒక నీచజాతిది. ఇవాళ ఇక్కడకి వచ్చింది. దాన్ని చీపురుతో కొట్టి, తన్ని, తగిలెయ్యమని మీ అమ్మతో

చెప్పాను. కాని ఆపని జరగలేదు. ఆపని చేయడానికి నువ్వే తగినవాడివి. వెళ్ళు. ఈ రాత్రికిరాత్రి దాన్ని బయటికి గెంటెయ్. అప్పటికిగాని నాకు నిద్ర పట్టదు."

వ్రజేశ్వరుణ్ణి తల్లి పిలిచింది.

"నాయనా, ఎంతటివాడి వయినా ఆడదానిమీద చెయ్యి చేసుకోకూడదు. నేను నీ కన్నతల్లిని. ఆ అమ్మాయి లాంటి ఆడదాన్నే. నే చెప్పేది ఒకటే మాట. చేయి చేసుకోకుండా ఆ పిల్లను నెమ్మదిగా సాగనంపు. అంతే."

* * *

వ్రజేశ్వరుడు చరచర నడిచి మేడ మీద తన మూడోభార్య — సాగర్ బహు గదిలోకి వెళ్ళాడు. అయితే అక్కడ సాగర్ లేదు, మరొక యువతి ఉంది. అత నేమీ మాట్లాడలేదు. ఆమే మాట్లాడ లేదు. కాని ఇద్దరి చూపులూ మాత్రం కలిశాయి.

ఒక్కడుగు ముందుకువేశాడు వ్రజే శ్వరుడు. ఆమె లేచింది. అతని పాదాల మీద వాలిపోయింది. జలజల రాలే కన్నీ టితో అతని పాదాలు తడిపివేసింది. వ్రజేశ్వరుడు ఆమెను రెండుచేతులతోను లేవదీశాడు. అక్కున చేర్చుకున్నాడు. అంతలో —

ఎవరో బయట తలుపుకి తాళం పెట్టారు.

"సాగర్ ! సాగర్ !! ఏమి టది ? ఏమి టది ?—" అంటూ కంగారుపడ్డాడు వ్రజేశ్వరుడు. కాని ... ఇంకెక్కడి సాగర్ !—బయట తాళం పెట్టేసి ఎప్పుడో తుర్రుమంది !!"

తెల్లవారింది. తాళం తీసిన చప్పుడు.

ఆమె లేచి, వ్రజేశ్వరుడి పాదాలకు నమస్కరించి, "సాగర్ తాళం తీసింది. ఇక నేను మీ పక్కనుంటే బాగుండదు. నన్ను మీ భార్యగా స్వీకరించినా సరే, లేకపోయినా సరే, నే నేం బాధపడను. కాని — ప్రఫుల్ల అనే ఈ దాసి ఒకతె ఉందనిమాత్రం గుర్తుంచుకోండి. అంతే చాలు, నాకు."

"ప్రఫుల్లా !— మరొకసారి నాన్న గారిని అడిగిచూస్తా. అకారణంగా నిన్ను విడిచిపెట్టడ మేమిటి ? నాచేత అలాంటి పాపం చేయించకు."

"ఎన్నటికీ మిమ్మల్ని నేను నిందిం చను. నన్ను మీరు కాదంటే కద నాకు బెంగ. ఈ ఒక్కరాత్రి మీ శయ్యమీద నాకు స్థాన మిచ్చారు. అదే పదివేలు. నన్నుగురించి మీ నాన్నగారితో ఘర్షణ పడకండి."

"నిన్ను పోషించవలసిన బాధ్యత నాపై ఉందిగా ?"

"మీ నాన్నగారు నన్ను చీపురుతో కొట్టి, తన్నితగిలెయ్యమన్నారు. ఆయన చేతి బిచ్చంకూడా నాకు వద్దు. మీ సొంత



మనేది ఏదైనా వుంటే అది యివ్వండి, తీసుకుంటా."

"ఇప్పుడు నా దగ్గర వుండేది ఈ ఉంగరం ఒక్కటే; ఇంద తీసుకో. నువు కోరినట్టు స్వంత ఆర్జనకోసం ప్రయత్నిస్తా."

"ఈ ఉంగరం చాల్లెండి నాకు. మీ రెప్పుడైనా నన్ను మరిచినా, నేను సదా మిమ్మల్ని ధ్యానించటాని కిది చాలు."

"మరవడమా!_ ఎవరినైనా మరుస్తా నేమో గాని, నిన్ను మరవగలనా ప్రఫుల్లా?"

"మరుస్తా రని కాదు. ఒక వేళ మరిచి పోవటమే జరిగితే, దీన్ని మీకు చూపించ వచ్చుకదా. అవునుగాని, దీ ని మీ ద ఏమిటో అక్షరా లున్నాయ్?''

"అప్పను; ఆ అక్షరా లేమిటో చెప్పుకో చూదాం...''

"వే రేమిటుంటుందిలెండి. శ్రీవారి నామధేయం!_ అంతేనా?"

* * *

నరేంద్ర భూమిలో భూతనాథ్ ఒక చిన్న గ్రామం. ఆ గ్రామంలో హర వల్లభబాబు గొప్ప జమీందారు. ఆ జమీందారు కొడుకే వ్రజేశ్వరుడు. అత నికి మూడు పెళ్ళిళ్లు. అందులో పెద్ద భార్య ప్రఫుల్ల. పేదయింటి పిల్ల, అయితే అందకత్తె, గుణవంతురాలు.

రెండో భార్య నయనతార. చూడ చక్కనిది కాకపోయినా ఉత్త గయ్యాళి. మూడో ఇల్లాలు సాగర్‌బహు. డబ్బు కోసం చేసుకున్న భార్య.

ప్రఫుల్ల పెళ్ళి సమయం—

ఆమె తండ్రి సామాన్య గృహస్థు. ఒక్కగా నొక్క కూతురుకీ గొప్ప యింటి సంబంధం వచ్చిందికదా అని సంబరంతో తన ఆస్తి నంతా కర్చుపెట్టి పెద్ద ఎత్తున పెళ్ళి జరిపించాడు. ఇంత చేసి ఏం సార్థకం?— మర్యాద జరగ లేదని ఆడపెళ్ళివారివేపు చుట్టాలు అలిగారు. ఆ కక్షతో బంతిలో కూచున్న వాళ్ళు ఆపళంగానే లేచిపోయారు. ప్రఫుల్ల కుటుంబాన్ని వెలేశారు.

పదిమంది మాటా పట్టుకుని హరవల్లభుడు కోడల్ని కాపరానికి రానియ్య లేదు. వియ్యాలవారు పెట్టిన సామాగ్రులన్నీ వెంటనే తిరగ్గొట్టేశాడు. కొడుకు వ్రజబాబుకీ గొడవ కాస్తంతా తెలియ నివ్వలేదు.

* * *

ఆమె వితంతు. మగదిక్కు లేదు. పెళ్ళి అయీ కాపరానికి వెళ్ళని కూతురు తనకు తోడు!— తనను ఏలా పోషించుకుంటుంది, కూతురు నెలా పోషిస్తుంది?—

"అమ్మాయీ, ప్రఫుల్లా!— అల్లవాళ్ళింటి కెళ్ళి కాసిని బియ్యం తెస్తా, కాస్త ఎసరు పడెయ్యమ్మా" అంది తల్లి.

"అమ్మా!— నువ్వెక్కడికీ పోయి అడుక్కురావద్దు. ఉన్నదే తిందాం."

"ఏమిటుందే నీ మొహం. ఎందర్ని ముష్టెత్తండీ ఈ రెండు కడుపులు నిండుతై? మన మేమంత సామంతులం గనకనా నామోషీ పడటానికి? పేద వాళ్ళం. మనకి సిగ్గెందుకే?—"

"తిండి లేకపోతే పస్తుందాం. లేదా ఏ జంధ్యాలో వడికి అమ్ముకుందాం. తిందాం"

"మనింట రాట్నమయితే వుందిగాని, పత్తి ఎక్కడ తెస్తావే?—"

అన్నిటి కన్నీ తెగని సమస్యలుగానే వున్నాయి ఆ తల్లీ కూతుళ్ళకి. చివర కిలా అంది ప్రఫుల్ల:

"అమ్మా!— నా అత్తవారింటికి నే వెళతా. నా భర్త సొత్తు నే తింటా. నా భారమైనా నీకు తగ్గుతుంది. నా నుంచి కలుగుతున్న సమస్యలు నీకు తీరతాయి. నన్ను గురించిన బెంగా, విచారమూ నీకు తొలగిపోతాయి."

* * *

"ఎవరమ్మా మీరు?" అని అడిగింది ఆ యింటి గృహిణి.

"మీ బంధువులమే!" అన్నది ప్రఫుల్ల తల్లి.

"బంధువులా! అంటే?"

"అదేటమ్మా - దుర్గాపురం ఇయ్యపరాలుగారు. మన సినబాబు అత్తగోరు. ఈరే తెలియదా?" అంటూ అడిగింది దాసీది తార.

"కూచోండి. ఈ అమ్మాయీ?"

"మీ కోడలు."

"ఎందు కొచ్చినట్టూ యిప్పుడు?"

"తల్లి దగ్గరికి బిడ్డ ఎందుకొస్తుంది? అత్తగారింటికి కోడ లెందుకు వస్తుంది?"

"మంచి ఇంటి పిల్లలు పిలుపు లేకుండా వస్తారా, అత్తా మామా ఎప్పుడు పిలిస్తే అప్పుడు వస్తారు గాని...?"

"కోడలి ఊసు తలపుంటే కద అత్త మామలకు? ఏడు జన్మాల కైనా పిలవక పోతే ఏం చేస్తారు? నేను అనాధను. నాపొట్ట పోసుకోవటానికే ఆస్కారం లేకపోతే, నీ కోడల్ని ఎలా పోషిం చేది?"

"అంత పోషించటానికి దిక్కు లేనిదానివి, పిల్ల నెందుకు కన్నావ్?" అంటూ తల్లీ కూతుళ్ల కేసి అదోలాగ చూసిం దామె.

"సమాధానం చెప్పమంటావా? అట యితే విను. మరి - తిండీ బట్టా లెక్క చూసుకునే, బిడ్డల్ని కంటున్నావా నువ్వు? కొడుకుని కన్నప్పుడు కొడుకుతో పాటు కోడలు వస్తుం దనీ, కొడుకుతో పాటు కోడలికీ తిండీ బట్టా కావలసి వుంటా యనీ, జమా ఖర్చులు వేసుకోలేదు కాబోలు అమ్మగారు?–"

యజమానురాలి గుండెల్లో దూసుకు పోయిం దీ మాట.

"వదిన గారూ!– లేని పోనివి కల్పించి దెబ్బలాడటాని కని రాలేదు నేను. మీ కోడల్ని మీ యింట్లో దిగబెట్టి పోదా మని వచ్చా. ఇదిగో మీ కోడలు. మీ దగ్గర దిగబెట్టేశా, వచ్చిన పని తీరింది, నే పోతున్నా..." అంటూ చరచర మని వెళిపోయింది. ప్రఫుల్ల తల్లి. ప్రఫుల్ల మట్టుకు అక్కడే నిలబడి వుంది.

"మీ అమ్మ వెళ్ళిందిగా? నువ్వూ వెళ్ళు!" అంది అత్తగారు.

తల కిందికి దించుకుని, అత్తగారి వేపు చూసీ చూడనట్టు చూస్తూ, "నేను వెళ్ళిపోవడానికి రాలే దత్తయ్యా!" అంది ప్రఫుల్ల.

ఈ మాటకు అత్తగారు కోడలిముఖం పరికించి చూసింది. "ఈ బంగారు బొమ్మనా నే పొమ్మన్నది? మా యింటి ఈ మహాలక్ష్మిని పొమ్మని నా నోటితో నేనే అన్నానా?" – ఈ యోచనలతో ఆమె మనస్సు పరిపరివిధాల పోయింది.

"అమ్మాయీ!– నే నేం చెయ్యను చెప్పు. వెలివేశా రన్న అపవా దొకటి వుందికదా మీ కుటుంబానికి?" –

"అత్తయ్యా!– వెలేశా రన్న భయంతో ఎవరిపిల్లల్ని వాళ్ళు వదిలే స్తారా?– నేను నీ బిడ్డనుకాదా?– నన్ను వెలేస్తే వేశారు. ఆ అవమానం నువు పడవద్దు. మీ యింటి పనిమనిషిగా పడి ఉండనీ..."

కటిక గుండెను సయితం కరగించి వేసే ఈ మాటలు అత్తగారిని అక్కడే ఊపివేశాయి. "నువ్విక్కడే కూచో తల్లీ!– వెళ్ళి మీ మామగారిని కనుక్కు వస్తా"నంటూ లోపలికి వెళ్ళింది.

"అక్కా!— నేను నీ సవతిని. నన్ను సాగర్ అంటారు. అత్తయ్యా నువ్వూ మాటాడుకోవటం తలుపుచాటునించి విన్నాను. నేనేగాక నయనతార అని మరి వొక సవతి ఉంది మనకి. అది వట్టి దుష్టురాలు. పొరపట్నా అదీ, పగలు చూస్తే రాత్రి కలలోకి వస్తుంది."

"అందుకే కాబోలు నిన్ను చేసుకున్నారాయన."

"కాదక్కా!— మా నాన్నకి నే నొక్కగా నొక్క ర్తెను. మా నాన్న గొప్ప శ్రీమంతుడు. కనుక ఆయన నన్ను చేసుకున్నది నాకోసంకాదు, నా డబ్బుకోసం. అదీకాక - మా నాన్నకీ మామగారికీ పడదు, అందుకని నే నిక్కడ ఉండేదిలేదు. ఎప్పుడైనా పని మీద వచ్చి, రెండుమూడు రోజు లుండి వెళ్ళిపోతుంటా."

"సాగర్!— నా కథకంటే విచిత్రంగా ఉందమ్మా నీ చరిత్ర. అవునుగానీ — అత్తయ్య అటు వెళ్ళగానే నన్నెందుకు ఇలా రమ్మన్నావు?"

"అక్కా!— ఇంటికి ఏపరదేశి వచ్చినా, ఇన్ని మంచినీళ్ళయినా పోస్తామే. అటువంటిది — ఇంటికైన పెద్దకోడలివి, నువ్వొస్తే దాహానికి కావాలా అనైనా అడిగారుకాదు, పాపిష్టివాళ్ళు. నువు సరిగా తిండి తిని ఎన్నాళ్ళయిందో!— పద్మంలాంటి నీ ముఖం వాడిపోవటం చూస్తేనే తెలుస్తూంది. ఇదుగో, ఈ మిఠాయుండ తిని, కాసిన్ని నీళ్ళుతాగు."

"చెల్లీ!— నన్నుగురించి మాటాడేం దుకు మామయ్యగారి దగ్గర కెళ్ళారు అత్తయ్య. నా అదృష్టం ఎలా వుందో తెలుసుకునేదాకా ఈ యింటో నే నేం ముట్టుకోను."

"అలా అంటే కాదక్కా!— నువు వీళ్ళ సొత్తేమీ తినొద్దులే. ఇవి మాపుట్టింటి నించి నే తెచ్చిన మిఠాయిలు. తిను." సాగర్ ఆతిథ్యాన్ని ప్రఫుల్ల స్వీకరించక తప్పిందికాదు. మిఠాయి తిని, మంచి నీళ్ళు తాగి కాస్తంత తేరుకుంది.

"నాకయితే ఆకలి తీరింది చెల్లీ! మా అమ్మ తిండి కళ్ళజూసి ఎన్నాళ్ళయిందో, ఆకలి బాధతో ఈపాటికి చావనే చచ్చిందో, ఇంకా కొన ప్రాణాలతో కొట్టుకుంటూ వుందో!"

"మీ అమ్మగా రెక్కడున్నారూ?"

"ఏం చెప్పుకోను?— నన్నిక్కడ వదిలేసి వెళ్ళింది. దోవలో..."

పెద్దమ్మనుగురించి నువ్వేం బెంగెట్టుకోకు అక్కా!— మన పురోహితుడి పిన తల్లి వుంది బ్రహ్మరాకురాణి అని. ఆమె చేతి కిచ్చి పెద్దమ్మకి భోజనం పంపిస్తా.''

"ఏమో చెల్లీ!— నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి. ఇందాకటి కబురు సగంలో ఆపేశావు, మరి?"



"అవును అదే_ఏ దెలా వున్నా, నువు రానే వచ్చావు. ఇక్కడే వుండిపో అక్కా' మావగారు ఒప్పుకోనీ, ఒప్పుకోకపోనీ తొందరపడి మటుకు వెళ్ళిపోవద్దు అవునుగాని అక్కా !_ ఒక చిన్న సంగతి ఇవాళ సాయంత్రం ను వ్వీ గదిలోకి వచ్చి కూచో. గమ్మత్తు జరుగుతుంది చూదువుగాని."

"ఏమి టమ్మా ఆ గమ్మత్తు?"

"ఇప్పుడు చెప్పకూడదు. తరవాత నీకే తెలుస్తుంది."

అంతలో ప్రఫుల్ల అత్తగారు అటుగా వచ్చింది,

"ఎక్కడి కెళ్ళావమ్మా?" అని అడిగింది ప్రఫుల్లను.

"ఎక్కడికీ పోలే దత్తయ్యా! మన లోగిలీ పెరడూ చుట్టివస్తున్నా"

చిన్నవోయిన ముఖంతో_

"నే నేంచేసేది తల్లీ! ఇంటి కయిన పెద్దకోడలివి, ఈ యిల్లూ వాకిలీ చూసుకోవలిసినదానివి నీ గతి ఇలా వచ్చె! మీ మావగారు చూడబోతే, ససేమిరా ఒప్పుకోనంటారు. కానీలే, మరోసారి చెప్పి చూస్తా. ఇంత పొద్దుపోయిందే. ఈ వేళప్పుడు ఎక్కడి కెళతావు? ఇవాళ్టికిక్కడే వుండు" అంది కడుపులో గంపెడు దుఃఖంతో.

"అలాగే, ఉంటాన్లే అత్తయ్యా! మామయ్యగారిని నా మాటగా ఒక్క ప్రశ్న అడగండి; మా అమ్మయితే

రాట్నం వడుక్కునో, మరోపని చేసు కునో పొట్టపోసుకుంటుంది. నే నేంపని చేసి జీవితం గడిపేది ? నన్ను నీచురాలి గానే చూడనివ్వండి. ఎంతయినా, వారి కోడలినే కదా, వారి అబ్బాయికి భార్యనే కదా.మరి ఈ నిర్భాగ్యురాలికి జీవనోపాధి యేమిటి ?—"

* * *

"బందిపోటో, దొంగతనమో చేసుకు బతకమన్నారు నిన్ను మామయ్య గారు"— అన్నది అసూయ నిండిన నేత్రాలతో నయనబహూ. ఆమె కళ్ళు ప్రఫుల్లకు వ్రజబాబు ఇచ్చిన ఉంగరాన్నే గ్రుచ్చి గ్రుచ్చి చూస్తున్నాయి.

ప్రఫుల్ల కన్నులు కెంపు లయ్యాయి. పెదవులు వణికాయి. "నే పోతున్నా, వెళ్ళిపోతున్నా. ఈ పాపిష్టి కొంపలో మళ్ళీ కాలు పెడితే వొట్టు..." అంటూ గిరుక్కున మళ్ళింది. గుమ్మంవేపు వెళుతుంటే సాగర్ ఎదురువచ్చింది. "చెల్లీ !— నువు మీ నాన్నగారింటి కెళ్ళాక నిన్ను కలుసుకుంటాను."

"మా యిల్లెరుగుదువా నువ్వు ?"

"తెలియకపోతే తెలుసుకుంటా. ఇంకిప్పుడు సిగ్గేమిటో !''

"అక్కా !— మీ అమ్మగారు వచ్చి, నీ కోసం కనిపెట్టుకున్నారు. అదుగో, ఆ తోటకేసి చూడూ..."

తోటకేసి తల్లిదగ్గరికి దారి తీసింది ప్రఫుల్ల. సాగర్‌బహూ సవతిని సాగనంపింది.

* * *

ప్రాణంమీదికి వచ్చింది ప్రఫుల్ల తల్లికి. తిండీ, గుడ్డా లేకుండా చేసిన దారిద్ర్యం ఒక పక్క, కూతురు కాపరాన్ని గురించిన చిచ్చు ఒక పక్క పట్టి పీడించాయి ఆమెను. దీనికి తోడు తప్పని సరి స్నానాలవల్ల, నిత్యోప వాసాలవల్ల రోజు రోజుకీ జ్వరం హెచ్చి, చివరికి హరీమంది ఆ ముసిలి ఘటం !

లోగడ కక్షకట్టి, ప్రఫుల్ల కాపరానికి నీళ్ళుపోసిన పెద్దలే ఆ ముసలిదాన్ని పిడికెడు బుగ్గి చేసివేశారు. కర్మకాండ జరిగేటప్పుడు ఇద్దరు పెద్దలు వెళ్ళి హరివల్లభుణ్ని పిలవబోయారు. అతడు వాళ్ళతో, "మీ రేమన్న పెద్దమనుషులు ? ఇదివరకు మా కోడలి కుటుంబాన్ని వెలే యించినవాళ్ళు మీరే, ఇవ్వుడా ముసలమ్మ శ్రాద్ధానికి నన్ను పిలుస్తున్నవాళ్లూ మీరే. మాట నిలకడ లేనివాళ్ళు ! మళ్ళీ నన్ను నవ్వులపా ల్చెయ్యటానికా ఈ పిలుపు ? పో—పొండి !!" అని చివాట్లు పెట్టి, వాళ్ళని సాగనంపాడు. అతడు రాకపోయినా కర్మకాండ పూర్తి చేశారు, పెద్దలు.

ఈ మాటలు వ్రజబాబు చెవిని పడ్డాయి. ఎలాగయినా ఆరాత్రి ప్రఫుల్లను కలుసుకు తీరా లనుకున్నాడు.



తల్లి పోయినప్పటినుంచీ ప్రఫుల్ల ఆ యింట్లో ఒక్కర్తే ఉండలేక పోయింది. రాత్రిళ్ళు సాయం పడుకునేందుకు పూల్‌మణి అనే ఒక మంగలి వితంతువు వస్తూండేది. ఈమె ప్రఫుల్ల తల్లికి స్నేహితురాలు. స్నేహమే కాకుండా, ప్రఫుల్ల ఇంటికి పూల్‌మణి రావటంలో మరొక వుద్దేశంకూడా వుంది.

దుర్లభచంద్రుడు ఒక జమీందారు దగ్గర గుమాస్తా. వట్టి స్త్రీలోలుడు. అతనికి పూల్‌మణి అంటే ఎంతో ఆదరం.

ఆవేళ పూల్‌మణి ప్రఫుల్ల ఇంటికి వస్తూండగా, దోవలో మామిడితోటలో కలిశాడు దుర్లభచంద్రుడు, ఇద్దరూ గుసగుస లాడుకున్నారు. పూల్‌మణి మామూలుగా ప్రఫుల్ల ఇంటికి వెళ్ళి పోయింది.

రాత్రి—చాలా సేపటివరకూ ప్రఫుల్లకి నిద్రపట్టలే. అంతవరకు జరిగి ముగిసిన తన తల్లి జీవితకథ నంతా ఒక్కసారి కళ్ళకు కట్టినట్టయింది. ఇక తన జీవితం ఎలా గడుస్తుందా అనే బెంగతో, ఆలోచిస్తూనే నిద్రపోయింది.

రెండుజాములు దాటింది. ఎవరో తలుపు తట్టినట్టయింది. పూల్‌మణి లేచి తలుపు తెరిచింది. ఒకవ్యక్తి లోపలికి వచ్చాడు, ప్రఫుల్ల గదిలో ప్రవేశించాడు. కష్టాలు మరచి కమ్మగా నిద్రపోతున్న ప్రఫుల్ల ముఖాన్ని అట్టె చూశాడు. ముఖంపై గుడ్డపరచి నోరు కట్టివేశాడు.

మరి కాస్సేపటిలోనే ఆ యింటినుంచి

ఒక పల్లకి బయల్దేరింది. బోయీలు ముక్కలేదు, మూలగలేదు. అలికిడి లేకుండా, కిక్కురు మనకుండా మోసుకు పోతున్నా రా పల్లకీని. పల్లకీ వెంట మరిద్దరున్నారు. ఎవరూ ఏం మాటాడ లేదు.

అలా వాళ్లు నాలుగు కోసులు దూరం పోయి పోయి, దట్టమైన ఒక అడవి మార్గం పట్టారు. ఆ ప్రాంతంలో దొంగల భయం ఎక్కువ. సర్కారు కూడా లొంగదియ్యలేని భయంకరమైన బంది పోటుమూక లున్నాయి.

భయపడుతూనే నడుస్తూంది పల్లకి. నడుస్తున్న పళంగానే ఠకీమని ఆగింది. పల్లకీ ఎదుట ఆజానుబాహు లిద్దరు నిల బడి వున్నారు! బోయీలు పల్లకి దించి, అటూ ఇటూ బిత్తరపోయి చూస్తు న్నారు.

"బాబోయ్ దొంగలు! దొంగలు!! దొంగలు!!!" అంటూ వాళ్లు కాలి కొద్దీ పరుగుచ్చుకున్నారు! కూడా వున్న ఇద్దరిలో ఒకడు ఆ బోయీలను వెంబ డించాడు. చివరకు మిగిలిన వ్యక్తి— "అరే దుర్మార్గుడా, దుర్లభచంద్రా?— మోసగించి తెచ్చిన ప్రఫుల్లనీ, నన్నూ ఈ నట్టడివిలో వదిలి పోతావా? ఆగు— ఆగు!!—" అని అతనివెనకే పరు గెత్తింది. పల్లకి మాత్రం మిగిలింది!—

"చూశావా, తమ్ముడూ! లోకంలో ఎంత పిరికివా ళ్ళున్నారో! మన దోవని మనం పోతుంటే, దొంగల మనుకొని, పల్లకి వదిలేసి అంతా పోయి దాక్కు న్నారు. రా, మన దారిని మనం పోదాం. వాళ్ళ పల్లకీ వాళ్లు మోసుకుపోతారు..." అని నవ్వుకుంటూ ఆ యిద్దరూ వెళ్ళి పోయారు.

కొంచెం సద్దు మణగ్గానే పల్లకీలో నించి ప్రఫుల్ల ఇవతలికి వచ్చింది. నోటి కట్టు నెమ్మదిగా విప్పుకుంది. జరిగిన సంగతి తెలియకపోయినా, లేని ధైర్యం తెచ్చుకుంది. అరవలేదు; గోల చెయ్య లేదు. తెల్లవారే దాకా ఆ అడవిలోనే కాలక్షేపం చేసింది.

తెల్లవారింది; ఏదేనా దోవ దొరక్క పోతుందా అని చుట్టూ కలయజూసింది, ప్రఫుల్ల. కాలిబాట ఒకటి దొరికింది. కొంతదూరం సాగేసరికి అదీ మాయ మయింది. అయితే — కొద్ది దూరంలోనే ఒకటి రెండు పాత యిటికలు కని పించాయి కనుక, దగ్గరలోనే ఏదో యిల్లుండవచ్చు ననుకుంది. సాహసించి ముందుకు సాగింది. పోగాపోగా అటు వంటి ఇటికలు ఇంకా ఎన్నో తగిలాయి. అనుకున్నట్టుగానే, చివరికి ఆ దట్టమైన అడవిలో ఒక పాడుపడ్డ ఇల్లు కంట బడింది, పరిశీలనగా చూస్తే, ఒకప్పుడు అది గొప్పదశ అనుభవించిన భవన మని తెలుస్తోంది. ఇప్పుడు — ఒక జీర్ణ కుటీరం!—

లోపలికి వెళ్ళింది ప్రఫుల్ల.

ఇంటోనించి ఏదో మూలుగు విని పిస్తూంది. మూలుగు వస్తున్న గదిలోపలికి వెళ్ళిందామె. ఒకపండు ముదుసలి మంచం పట్టి వున్నాడు. లోతుకిపోయిన కన్నులు, ఎండిపోయిన పెదవులు, శ్వాసమాత్రం ఇంకా ఆడుతూంది.

"ఎవరు తాతా, నువ్వు ?— ఏమిటీ నీ వంట్లో ? —'' అని అడిగింది ప్రఫుల్ల.

"అమ్మా, దాహం ! దాహం ! !— ముందు కాసిన్ని మంచినీళ్ళివ్వు. నోరెండి పోతూంది..." అన్నాడా వృద్ధుడు, నీరసించిన గొంతుతో.

ఇంటోనే ఒక మూల కూజాలో వున్నాయి మంచినీళ్ళు. కాసిని గళాసులో పోసి, తెచ్చియిచ్చిందామె. మంచినీళ్ళు తాగి కాస్త తెప్పరిల్లాడు తాత. గొంతు సవరించుకుని, ఇలా చెప్పాడు.

"అమ్మాయీ ! నన్ను కృష్ణగోవింద దాసు అంటారు. నేనొక వైష్ణవిప్రేమ పాశంలో పడ్డాను. ఆమె భక్తిగీతాలు పాడుతూ, పుణ్యం సంపాదించుకుంటూ ఉండేది. ఆమెను చూచి నా మనస్సు చలించింది. ఆమెను తోడుగా తీసుకుని బంగాళాదేశం చేరుకున్నా. నవుకరి కోసం వెతుకుతూ ముర్షిదాబాద్‌లో దిగాను. సువాసనగాని, సౌందర్యంగాని ఎక్కడవున్నా కస్తూరి పరిమళంలాగా గుప్పున వ్యాపిస్తుంది. అలానే చూడ చక్కనిదైన ఆ వైష్ణవ స్త్రీ సౌందర్యం నవాబ్ మహల్‌దాకా పాకిపోయింది

"ఇంక అక్కడ వుండటం మంచిది కాదని తోచింది. వెంటనే, ఆమెను వెంటబెట్టుకుని, ఆ వూరు వదిలా, దేశం తిరిగి తిరిగి చివరికిద్దరం ఈ కీకారణ్యం చేరుకున్నాం. వారానికోసారి సంతలో సరకూ సప్పరా తెచ్చుకుని, గుట్టుగా కాలక్షేపం చేస్తూవచ్చాం.

"ఒకనాడు — ఈ కింది గదిలో పొయ్యికోసమని మట్టి తవ్వుతూవుంటే నాకొక రూపాయి వంటి నాణెం దొరికింది. ఇంకా తవ్వాను, ఒక బిందెడు నాణాలు దొరికాయి. చేతినిండా డబ్బు!— ఇంకేం? వళ్ళు వంచనక్కర్లేకుండా, విశ్రాంతిగా కాలం గడచిపోతూంది. మరొకరోజున ఒక ఎలుక దాని కలుగు లోనించి వస్తూండగా బంగారు మొహరు ఒకటి కింద రాలింది. కనిపెట్టి, ఆ చోటు ఆనవాలు పెట్టుకున్నా.

"ఆవేళ సంతరోజు. నాకు వంట్లో బాగుండక, వైష్ణవిని పంపించాను. ఆమె అలా వెళ్ళగానే, నేను ఆ ఎలుక కలుగు తవ్వటం ప్రారంభించా. తవ్వగా తవ్వగా, అటువంటివే బంగారు మొహర్లు ఇరవై బిందెలనిండా దొరికాయి. ఇంత ధనం ఎవళ్ళ కంటైనా పడితే ఎంత ప్రమాదం? కనుక జాగ్రత్తగా ఆనవాలుగా మళ్ళీ ఎక్కడి దక్కడ పాతిపెట్టేశాను.

''సంతకు వెళ్ళిన నా ప్రియురాలు ఈ క్షణంవరకు తిరిగి రాలేదు ఇక

వస్తుందని నాకు. నమ్మకమూ లేదు. ఆకస్మికంగా ఒకవేళ నేను కన్ను మూస్తే, ఎవరినీ కష్టపెట్టకుండా నన్ను ఖననం చేయటానికి గాను పీలుగా, అదుగో వాకిట, గొయ్యికూడా సిద్ధం చేసింది. నా అవసాన కాలానికి నా వైష్ణవి లేకుండాపోయింది. కాని, సమయంలో దేవుడు నిన్ను పంపించాడు. ను వ్వెవరవో నేనెరుగను. తెలియక పోయినా నాకేం బాధ లేదు. నా గొంతులో ఇన్ని నీళ్ళు పోశావు. అదే కావలిసింది.....ఇంతకూ, నా తదనంతరం ఈఆస్తి నీకు దక్కవలసివుంది..

"అమ్మాయీ!– పెరట్లో పాకలో ఆవుంది. పాలు పితికి తెస్తావా?"–

ఈ మాట అన్నదే తడవు, ప్రఫుల్ల వెళ్ళి పాలు పితికి తెచ్చి, గోవిందదాసుకి కాసిని ఇచ్చి కాసిని తను తాగింది.

"తల్లీ!– ఈ ఆస్తి ఎవరికీ ఇవ్వక పోతే నా ప్రాణం పోదు. నాకు ముక్తి వుండదు. బొందె పోయినా, నా ఆత్మ ఇక్కడ తిరుగుతూ ఉంటుంది. నా ప్రియురాలు వచ్చివుంటే ఈ ఆస్తి ఆమెకే దక్కేది. పోనీలే; నువ్వేనా దీన్ని తీసుకుని నాకు ముక్తి కలిగించు.

"ఇంక నేను ఎక్కువసేపు మాటడ లేను. అందుచేత ఆ స్తిని గురించిన వైనం చెబుతా, విను: నా పక్కకింద నలుపలుకల రాతిపలక ఒక టుంది. అది తీస్తే ఒక సొరంగం అగపడు తుంది. దానికి మెట్లున్నాయి. జాగ్రత్తగా దిగి వెళ్ళు. వెంట దీపం కూడా పట్టుకు వెళ్ళాలి. తరువాత కిందని ఇలాంటిదే మరొక గది వుంది. ఆ గదిలో వాయువ్య మూలని......"

అంతే. మరి మాటాడలేక పోయాడు వృద్ధుడు. ఊపి రింకా ఆడుతూనే వుంది.

ఆ రాత్రి మూడో ఝాముకి కృష్ణ గోవిందదాసు విశ్రాంతగా కన్ను మూశాడు!– ప్రఫుల్ల ధైర్యమూ, శక్తీ తెచ్చుకుని, తవ్వివుంచిన గోతిలోనే ఆ వృద్ధుణ్ని సమాధి చేసింది.

* * *

"ఈ మాట ఎవళ్ళతోనూ చెప్పకు సుమీ. మనం సామాన్యులం, సామాన్యుల లాగానే ఉండాలి. పెద్ద యింటి విషయాల్లో తల దూర్చకూడదు. అసలింతకీ జరిగిన సంగతేమిటో తెలుసా?– విను: ప్రఫుల్ల సాయం పడుకునేందుకు రాత్రి నేను మామూలుగా వెళ్ళానా?– ప్రఫుల్ల పక్కదగ్గరి కో ఆకారంవచ్చింది. చూతును కదా, అది వాళ్ళమ్మ. అచ్చు వాళ్ళమ్మే!– అవిడే దెయ్యమై అలా వచ్చేటప్పుడు తుఫాను గాలిలా శబ్దమయింది. మరుక్షణంలో ఏమీ లేదు. మంచం మీద ఆ పిల్లా లేదూ, వచ్చిన దెయ్యమూ లేదు. నీకు పుణ్యముంటుంది గానీ, నోరు జారి ఈ సంగతి ఎవళ్ళతోనైనా అనేవుసుమా!" అంటూ, పూల్

మణి ఒక కట్టుకథ కట్టి చెప్పింది వూళ్లో.

ఎవళ్ళకూ చెప్పవద్దు అన్న ఈ కథ అతి రహస్యంగా ఆనోటా ఆనోటా పాకి, వూరువూరంతా పొక్కిపోయింది.

చివరకు — ప్రఫుల్లకోసం వేయి కళ్ళతో వెతుక్కుంటూ వచ్చిన వ్రజేశ్వరుడి చెవిని కూడా పడిందీకథ. ఇది వినగానే అల్లకల్లోలమైంది అతని హృదయం! —

* * *

"బాబూ! బజారుకి దోవ ఎటూ?"

"బజారా! — ఇక్కడెక్కడుంది బజారు? అబ్బో, చాలాదూరం. పోవాలంటే, జాముసేపు పైనవుతుంది. పైగా దోవలో దొంగలూ దోపిడిగాళ్లూ. ఆడాళ్ళు అసలే వెళ్ళలేరు. నువ్వా ఆడదానివి. ఒక్కత్తెవూ ఎక్కడికెళ్తావ్? ఎలా వెళ్ళగలవ్? —"

వయసులో వున్న మగువ ఆమె. యుక్తవయస్కుడతడు. దుప్పటి కప్పుకుని వున్న అతడు కుంకుమ బొట్టుతో, మంచి తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు.

"అమ్మా! — మీ ఇల్లెక్కడ? —"

"ఈ అడివిలోనే."

"ఈ అడివిలోనా! ఇక్కడే వుంటూ బజారుకే దోవ తెలియదా?"

"కొత్తగా వచ్చాను బాబూ, ఇక్కడికి."

"నేను తప్ప ఈ అడివిలోకి మరెవళ్ళూ రారే. నువ్వెలా వచ్చావ్? — పోనీలే, భయపడకు. ఇక్కడే నా కొకదుకాణముంది. నీ క్కావలసిన ఉప్పూ, పప్పూ, అన్నీ నా దగ్గరే కొనుక్కోవచ్చు."

"అలాగే, బాబూ!"

అతని వెంట వెళ్ళిందామె. కావల్సిన సామాన్లు తీసుకుంది. చేత నున్న మొహరు అతని కిచ్చి, "ఎంతయిందండీ?" అని అడిగింది,

ఒక్కణా అయింది, అంతే. ఈ మొహరుకి సరిపడా చిల్లర లేదే, నా దగ్గిర. ఎలా? పోనీ, నీతో మీ యింటికి వస్తా. చిల్ల రిద్దువుగాని."

"లేదు. ఇంట్లోనూ చిల్లర లేదు."

"ఆఁ! — అటయితే నీ దగ్గర అన్నీ మొహర్లే నన్నమాట? — పోనీలే. నీ దగ్గర చిల్లరెప్పుడుంటే అప్పుడే ఇద్దువుగాని. నేనే వచ్చి తీసుకుంటాలే. ఒక్కసారి మీ యిల్లు చూపిస్తే చాలు."

పచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్టయింది ఆమెకు.

"వొద్దులెండి, మీకు శ్రమ. సరకులు తీసేసుకోండి. కష్టమయితే అయింది. బజారుకే పోయి తెచ్చుకుంటా. అదీగాక, నాకు బట్టలుకూడా కావల్సొంది."

"అమ్మా? — ఇల్లు చూపించినంత మాత్రాన నీ మొహర్లు కాజేస్తానని భయ

పడుతున్నావా ?_ నువ్వు బజారుకి వెళితే మటుకు నన్ను తప్పించుకోగలవా ?_"

ఆమె ముఖం పాలిపోయింది.

"తల్లీ !_ నీ దగ్గర కపటమాడలేను. నేను బ్రాహ్మణుడినే అనుకో. ఒక్క సం



గతి మాత్రం నిజం. నేను దొంగల సర్దారుని. నా పేరు భవానీ పాఠక్."

గడగడ వణికిం దామె.

"ఇంకా నమ్మకం లేదా ?_ ఇదుగో చూడు !_" అంటూ నగారా వాయించాడు. తక్షణమే బిలబిల మంటూ ఒక యాభై మంది యమదూతల్లాంటివాళ్లు వచ్చేశారు.

"ఇదిగో, ఈవిడను చూశారా ?_ నే



నీమెను అమ్మా! అని పిలుస్తాను
మీరూ అలాగే పిలవాలి తెలిసిందా!
అమ్మకు ఎటువంటి అపకారమూ జరి
క్కుండా చూసుకోండి వెళ్ళండి
అని చెప్పి సర్దారు వాళ్ళని పంపిం
చేశాడు

గత్యంతరం లేక, "సరే, రండి మా యిల్లు చూపిస్తా'' నంటూ ఆమె ఆ దొంగల సర్దారును కూడా తీసుకు వెళ్ళింది.

* * *

'అమ్మా !— 'నా' అన్నవా ళ్లెవరూ నీకు లేరంటున్నావు ఈ ధనంతో భోగా లనుభవిస్తా నంటావు ఒంటరిగా కూచుని నువ్వీ ఐశ్వర్య మంతా అనుభవింప గలవా ?— నీ మాటలు పసిపాపల మాటల్లా అమాయికంగా వున్నాయి

"నే చెప్పేది విను ఐశ్వర్య ముంటే, కొందరు హాయిగా అనుభవిస్తారు కొందరు పుణ్యం సంపాదిస్తారు మరి కొందరు నరకమార్గాన్ని బాగుచేసు కుంటారు నీ కెవరూ లేరుకనుక నువ్వీ ఆస్తిని అనుభవించలేవు పోతే — నీకు ఉపయోగపడేవి రెండే రెండుమార్గాలు ఇప్పు డేదో ఒకటి చెప్పు—పుణ్యం సంపా దించుకుంటావా, నరకమార్గాన్ని బాగు చేసుకుంటావా ?"

ఆలోచనలోంచి ఆమె మేలుకుంది

"బాబా !— నేను సామాన్య సంసారి యింట పుట్టాను పాప మంటే ఏమిటో తెలియదు నాకు తెలియనప్పుడు పాపాలు చెయ్యడ మెలా జరుగుతుందీ ? ఇంత వరకూ నేను పేదరాలినన్నమాట నిజం అందుకనే, మాయా మర్మం లేకుండా నీతో ఏమిటేమిటో అనేశాను. నాకు తిన తిండీ కట్ట బట్టా తప్ప మరేమీ అవ సరంలేదు జీవనోపాధికి ఇవి అమరి ఎలాగోలాగ రోజులు వెళ్ళబుచ్చుకో గలను మీరు గొప్పపండితుల్లాఉన్నారు నేను మీ కూతురువంటిదాన్ని.నా డబ్బంతా మీరే తీసేసుకోండి నాకు పిడికెడు మెతుకులు ఏర్పాటు చేయండి, చాలు "

వాత్సల్యంతో అన్నాడు దొంగల సర్దారు

"అమ్మా ! — నీ డబ్బు నీదేగాని నా దెలా అవుతుంది ?— కనుక నీ డబ్బు నువ్వే తీసుకో. అందులో నాకు ఒక్క పైసాకూడా వద్దు నువు నీచపుపనులతో జీవితం గడిపేదానివైతే, నీ ధనాన్ని ఎప్పుడో కాజేసి వుండేవాణ్ని. మళ్ళీ అడుగుతున్నా, చెప్పు — ఈ డబ్బుతో ను వ్వేం చేస్తావ్ ?—"

"మహాత్మా, మీరు జ్ఞానమూర్తులు. అటువంటి మీకు నే నేం సమాధానం చెప్పగలను? నేనే మిమ్మల్ని అడు గుతున్నా. మీరే చెప్పండి. న న్నేం చేయ మంటారు ?"

"తల్లీ !— నీ ప్రశ్నకు సమాధానం ఒక్క మాటతో చెప్పేదికాదు నీకు సమాధానమే కావాలీ అంటే, నువ్వు తగిన శిక్షణ పొందాలి. ఆ శిక్షణ పొంద టానికి అయిదారేళ్ళయినా గడువు కావల్సివుంటుంది. ఈ గడువు కాలంలో నువ్వీ డబ్బుసంగతి స్మరించనేకూడదు. నీకు తిండీ, బట్టా అంతా నేనే ఏర్పాటు చేస్తాను. నే చెప్పే ప్రతి విషయమూ

ఎదురు ప్రశ్న వెయ్యకుండా మన్నిం చాలి. ఏం, తెలిసిందా ?"–

"అయితే, నే నుండడం ఎక్కడ, బాబా ?"

"ఇక్కడే, నీ ఇంటోనే, ఈ యిల్లే బాగుచేయిస్తాను ఇక్కడే ఉందువు గాని."

"సరి, నే నొక్కత్తెనే ఉండాలా బాబా ?"

"లేదు లేదు తోడుగా ఇద్దరు స్త్రీ లను పంపిస్తాను. వా ళ్ళెప్పుడూ నిన్ను కనిపెట్టుకునే వుంటారు. కనుక నీకు వచ్చిన భయ మేం లేదు. ఈ అడవికి నేను యజమానిగా ఉన్నంతకాలమూ నీ కే అపాయమూ రాదని నమ్మ."

"మీ రెటువంటి శిక్షణ ఇచ్చినా సరే, సిద్ధమే "

* * *

పెద్దకోడ లైన ప్రఫుల్లను తరిమివేసి నప్పటినుంచీ హరవల్లభుడి పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. జాగీర్‌దారు దేవీసింహుడికి డబ్బు పంపితే, దోవలో దొంగలు దోచుకున్నారు, పన్నులు కట్ట లేదని. పదివేలు చేసే హరవల్లభుడి తాలూకా ఒకటి నూటముప్పయి రూపా యలకు వేలం అయిపోయింది. ఆదా యం లేకపోగా ఖర్చు వెచ్చాలకు అంతు లేకపోగా, హరవల్లభ జమీందారుకి అప్పులు కొండంతలుగా పెరిగాయి. వడ్డీలు పడిగుర్రా ల్లాగా పరుగెత్తి, అసలుతో సమంగా ముంచుకొచ్చాయి అవీ ఇవీ చేరి, జమీందారు జాగీరుదార్‌కి యాభై వేల రుణం ఇవ్వ తే ఖా ఖు చివరికి అరెస్టువారంటు దాకా వచ్చింది హరవల్లభుడి హస్తాలకు బేడీలు పడే పరిస్థితి ఏర్పడింది

వ్రజేశ్వరుడు అత్త వారింటికి– అనగా సాగర్‌బహూ తలిదండ్రుల దగ్గరికి చేరుకున్నాడు.

"నాయనా ! – నా సొత్తు అంతా నీదే కాదనను అయితే, ఇది నా దగ్గర ఉన్నంతంకాలమూ జాగర్తగావుంటుంది మీ నాన్న కిస్తే ఏముంది ? – అప్పుల వాళ్ళు పట్టుక పోతారు. నిమిషంలో హరించి పోతుంది. నీడబ్బు నువ్వే తగలేసుకుంటావా ? చెప్పు –"

"డబ్బు నా కక్కర్లేదు నా తండ్రివి రక్షించటం నా మొట్టమొదటి విధి నా ధర్మం."

"నీ తండ్రిని రక్షిస్తే నా కూతురి కేమిటయ్యా ఒరుగుతుందీ ? – మావగా రున్నంత మాత్రంచేత నా కూతురి దుఃఖం పోతుందా ? – "

ఉగ్రు డయ్యాడు వ్రజేశ్వరుడు కళ్ళెర్రబడ్డాయి.

"నీ కూతురునూ, డబ్బునూ పెట్టుకు కులుకు. అయినా, నీకు అల్లుడి అవసర మేముందిలే ? – ఇదే ఆఖరు. ఇక మీకు కనబడితే చూడు" అంటూ ప్రయా ణానికి సిద్ధ మయ్యాడు.

"నే నెవరో తెలియటంలేదా మీకు ?
నన్ను 'దేవీ చౌధరాణీ' అంటారు "

ఈ మాట వింటూనే ప్రజబాబు
విస్వేరపోయాడు సాగర్ హడలి
పోయింది. ఏమీ !— ఆ కొత్త వ్యక్తి
దేవీ చౌధరాణి .— పేరు పొందిన
దొంగలరాణి ! ' —

* * *

అది వర్షాకాలం త్రిస్రోత నది
పూర్తిగా నిండివుంది ఆ నదిలో ఒక
నావ నావ ముట్టడించబడివుంది. ముట్టడి
చేసినది మరెవరోకాదు - దేవీ చౌధరాణి
మరా. ముట్టడింపబడినవారూ ఎవరో
కాదు - ప్రజేశ్వరుడు బందీగా దొరికిన
ప్రజబాబుని పాంచేకౌడీ అనే ఆమె
కొనుక్కుంది

"ఇదుగో చూడు నిన్ను నేను కొను
క్కున్నాను ఎంతకు కొనుక్కున్నానో
తెలుసా ?— ఒక కానీ, ఒక్క కానీకి
నిన్ను కొన్నాను నువు నా సొత్తు నే
చెప్పిన పనల్లా చెయ్యాలి !నువ్వు ఏం,
తెలిసిందా ?—"

"చిత్తం, తెలిసింది "

"నువ్వు నీళ్ళు తోడగలవా ?"

"తోడలేను "

"పోనీ, కట్టెలు కొట్టగలవా ?"

"చేతకాదు "

"బజారు చేసుకురాగలవా ?"

"ఆఁ — ఏదో కాస్త. ."

"కాస్త కూస్తతో పని జరగదు
భోజనం చేయగలవా ?"

"ఓ చేతనవు..."

"పనిమంతుడివే చాలా ఏదీ, ఆ
విసినికర్ర ఇలా తీసుకురా, చూద్దాం
కాస్త విసురూ "

"చిత్తం "

"నీకు విసరటంకూడా చేతకాదులా
గుందే, ఏం మనిషివోకానీ '— పోనీ,
కాళ్ళు పట్టగలవా ?—"

నీలాంటి సుందరీమణుల పాదసేవ
చేయటంకంటె నాక్కావలసిందేమిటి ?—

" అయితే, కాస్త పట్టూ" — అంటూ
లక్కరంగుతో ఎర్రగా మెరిసిపోయే తన
పాదాలను ప్రజబాబు వొళ్ళో ఉంచింది,
పాంచ్‌కౌడీ.

ఇంతలో ఎవరో అటు వచ్చిన అలికి
డయింది కంగారుతో ప్రజేశ్వరుడు
ఆమె కాళ్ళు తీసి కిందికి తోసేశాడు

"అదేమిటి ! అలా పారిపోతున్నా
వేం ?" అని అడిగింది పాంచ్‌కౌడీ

ఈ గొంతుక ఇదివరికటిలాగ పాంచ్
కౌడీ గొంతుకలా లేదు మరేదో బాగా
పరిచయమైన గొంతుకలా ఉంది అట్టె
ఆలోచించాడు ప్రజబాబు- మెదడకు ఏదో
ఊహ తట్టింది ఉన్న పళంగా లేచాడు
పాంచ్‌కౌడీకి దగ్గరగా వెళ్లాడు ముసుగు
వేసిన ఆమె ముఖంకేసి ఒక్కమాటు
చూశాడు. గభీమని ముసుగు తీసివేశాడు
పకపక నవ్వింది పాంచ్‌కౌడీ కిలకిల

కాను, యమునను కాను, సాగర్‌ని. ఒకప్పుడు నేను ప్రతిజ్ఞ పట్టిన సంగతి జ్ఞాపక ముందా?. నేను పరాయి పడు



మని నవ్వింది. పరుపు మీద పడి దొర్లి దొర్లి నవ్వింది. విభ్రాంతిపోయాడు ప్రజ బాబు.

"నువ్వా సాగర్! నువ్వే నా. నువ్వేనా!!"

"అవును, నేనే. నేను నేనే. గంగను

చుగా కనపడగానే నా కాళ్ళు పట్టుకునేం దుకు సిద్ధమయ్యావు. నీ సాగర్ కాళ్ళు పట్టమంటే పడతావు ?– పోనిలే. ఎలా అయితేనేం. మీరు నా కాళ్ళు పట్టారు. నా ప్రతిజ్ఞ నెరవేరింది. నా కాళ్ళు పట్టుకున్నారు కనుక, ఇంక మీరు నా ముఖం చూడవచ్చు..." అని చెప్పి. మళ్ళీ ఒకసారి సాగర్ మనసారా నవ్వింది.

"ఇంతకూ, నువ్విక్కడి కెలా వచ్చావ్, సాగర్ ?"–

"తమ రెలా వచ్చారు, దొంగగారూ?"

"నన్ను ఖైదు చేసి తీసుకువచ్చారు. నిన్నూ ఖైదు చేశారా ?–"



"లేదు, నన్ను ఖైదు చేయటానికి నే నేమన్నా నేరం చేస్తేగా? ఇష్టపడి నాకు నేనే వచ్చా నిక్కడికి నా ప్రతిజ్ఞ నెరవేర్చుకుందుకు దేవీ సహాయం కోరి వచ్చాను"

ఆనాడు వ్రజబాబు సాగర్ ఆతిథ్యం స్వీకరించాడు

"నేను బ్రాహ్మణ్ని నాకు ఉత్త భోజనంతో సరిపోదు దక్షిణ కూడా ఇవ్వాలి" అన్నాడు వ్రజబాబు

'దక్షిణ స్వయంగానే ఇస్తారు రాణీగారు" అన్నది ఒక గొంతు

* * *

ఒక్కప్పు డామె పేదరాలు, ఈనాడు ధనవంతురాలు అప్పు డామెకు చదువు సంధ్యలు శూన్యం, నేడో!— సమస్త శాస్త్రాలలోనూ ప్రవీణ నాడు అందరికీ లోకువై, అగచాట్లుపడిన ప్రఫుల్ల ఆమె, నేడు గొప్ప దొంగల మురాకు నాయకురాలు— ఆమే దేవీ చౌధరాణీ!—

"ఇదిగో, ఈ కలశ తీసుకోండి సందేహించకండి ఇది వట్టిది కాదు గట్టిదే దీనిలో ముప్పయి మూడు వందల మొహర్లున్నాయి అరవై వేల రూపాయలకన్నా ఎక్కు వన్న మాట మీకు యాభై వేల రూపాయిలు అత్యవసరంగా కావలసి వచ్చాయని విన్నాను'

"నాకు డబ్బు అవసరమైన మాట నిజమే నే నీ డబ్బు తీసుకుంటాను అయితే, ఈ అప్పు నే నెలా తీర్చాలి?—"

"ఈ ధనం దేవుడిది దేవుడికే చెందాలి మీ కంతగా ఈ బాకీ తీర్చాలని వుంటే ఒక పనిచెయ్యండి నేను చని పోయిన తరువాత ఈ డబ్బుకి వడ్డీగా ఒక మొహరు కలిపి దేశసేవకు విని యోగించండి'

'అది నా సొంత ఖర్చు అవుతుంది మీ డబ్బు నా స్వంతానికి వినియోగించు కోవడం మిమ్మల్ని మోసగించటంకాదా? అలా ఎప్పుడూ చేయను

అయితే మీ ఇష్టం వచ్చినట్టు తీర్చండి మీరుగాని మీ మనుషులుగాని కావాలన్నప్పుడు నాదగ్గరకు రాలేరు నేను ఒకచోట స్థిరంగా ఉండను కనుక మీ కెప్పుడు డబ్బు సర్దుబాటవు తుందో చెబితే, ఎక్కడికి రావలసిందీ చెబుతాను''

"మాఘం, ఫాల్గుణం నాటికి కొంత డబ్బు పోగుచేయగలను ఏదెలా వున్నా, వైశాఖ శుద్ధ సప్తమినాడు మీరు ఇక్కడికే రండి, సరిగ్గా ఇదేచోట, చంద్రాస్తమానం తరువాత నేనిక్కడ ఉంటాను"

వ్రజేశ్వరుడు వెళ్ళటానికి సిద్ధపడ్డాడు

''దక్షిణ పుచ్చుకోంది ఎక్కడి కెళతారు? ఈ కలశ మీరు అప్పుగా స్వీకరించారు ఇక మీరు కోరిన ప్రకారం దక్షిణ ఇవ్వాలిగా? ఇదుగో మీ చెయ్యేదీ?''— అంటూ వ్రజబాబు చేతిని పట్టుకుని, తన వేలి ఉంగరం అతని

వేలికి పెట్టింది రాణి అలా ఉంగరం తొడుగుతూండగా ఆమె కళ్ళంట నీళ్ళు అతని చేతిమీద జలజల రాలాయి

సాగర్‌తో సహా వ్రజబాబు పడవ మీదికి వెళ్లాడు అంతలోనే దేవి పడవ పక్షిగా తుర్రుమంది ఆ భార్యా భర్తలు దేవిని గూర్చి ముచ్చటించుకుంటు న్నారు

"నిన్న నాకు ఫలహారం పెట్టి దీన్ని నాకు దక్షిణగా ఇచ్చింది చూడూ ! అంటూ, వ్రజబాబు ఉంగరాన్ని సాగర్‌కు చూపించాడు

"దీనిమీద ఏమిటో ఉందే ! — 'దేవీ చౌధరాణి' అని కాబోలు రాసివుంది "

'అరె ! — ఇదేమిటి ? నా పేరుం దేమిటి, ఈ ఉంగరం మీద ? ఇది నేను ప్రఫుల్ల కిచ్చిన ఉంగరం కాదుకద ? — సాగర్ ! - ఇప్పుడైనా నిజం చెప్పూ దేవి ఎవరు చెప్పూ

''మీ వస్తువును మీరే గుర్తించలేక పోతే, మధ్యని నే నేం చేసేది నేనామె నెప్పుడో గుర్తించాను ఆమె మాఅక్క ప్రఫుల్ల తప్ప మరెవరూ కాదు ఏం, ఇప్పుడైనా నమ్ముతారా ? —

* * *

"బాబా - నా ధనమంతా మీకు వప్ప గిస్తున్నాను అది మీ స్వంతమే అను కోండి ఇంతవరకు నే నెలా ఖర్చు చేస్తూ వచ్చానో, అ లా గే మీ రూ చేయండి నేను కాశికి పోవా లని నిశ్చ యించుకున్నాను నా కీ రాణిగిరీ వద్దు లోకానికి నేను ఉత్త బందిపోటును, దొం గను దోపిడిని చచ్చినా నాకీ కళం కం పోదు బాబా ! — మీరు పండితులు మీతో నేను వాదించలేను నా కీ పదవి నుండి సెల విప్పించండి అదే నా క్కావలిసింది '

"మరైతే, అమ్మా ' - నిన్న దొంగ తనాని కెందుకు పంపించావు ? నువు చెప్పకపోతే మాత్రం నాకు తెలియదా ? —"

' అన్ని సంగతులూ తెలిసినప్పుడు నిన్న రాత్రి దొంగతనం జరగ లేదని మాత్రం తెలియదా మీకు ? '

"అవును గానీ - ఆ వ్రజేశ్వర రాయ్‌ని ఎందుకు పట్టుకున్నారు ? వాడి కెందుకు దబ్బిచ్చారు ? వాడి తండ్రి హరవల్లభుడు పాషండుడు వియ్యపు రాలిని వెలేసి, కోడల్ని అన్యాయంగా వదిలేసి బలవంతాన చంపాడు వాడి పాపం పండింది జాగీర్దారు వల్ల ఆస్తింతా పోగొట్టుకున్నాడు ఇప్పుడు తినటానికి కాస్త తిండి దొరికిందంటే మళ్ళీ పూటు కుని మనమీదే ఎదురు తిరుగుతాడు,

"ఇప్పు డేం జరిగిందో తెలుసా నీకు ? — ను వ్విక్క డున్నట్టు ఇంగ్లీషువాళ్ళకి అప్పుడే తెలిసిపోయింది, నిన్ను పట్టేం దుకు అయిదు వందల మంది సిపా యీలతో సిద్ధమై వస్తున్నారు. కనుక హెచ్చరించి పోదా మని వచ్చా "

* * *

అప్పుడు భారత దేశాన్ని పరిపాలిస్తున్నది హేస్టింగ్సు దొర దేశంలో శాంతి భద్రతలకు భంగం కలిగిస్తున్న దేవీ చౌధరాణీ మురాను పట్టివేయటానికి బ్రహ్మ ప్రయత్నం జరుగుతున్నది రాణిని పట్టి తెచ్చినవాళ్ళకి గొప్ప బహుమానం— కలెక్టర్లందరకు కబురు వెళ్ళింది

వ్రజేశ్వరుడు డబ్బు సమకూర్చుకు వచ్చిన పద్ధతి విని హరవల్లభుడు మొదట భయపడ్డమాట నిజమే గడువులోపల బాకీ చెల్లించకపోతే ఇల్లూ వళ్లూ దోచుకుపోతారేమో నని హడిలిపోయాడు

"అయితే ఈ బాకీసొమ్ము ఎప్పుడు ఎక్కడ చెల్లుకట్టాలి ?' అని అడిగాడు

నంగ తంతా వివరంగా చెప్పాడు వ్రజబాబు

హరవల్లభుడు ఏదో దీర్ఘాలోచనలో పడ్డాడు

* * *

ఆవేళ వైశాఖ శుద్ధ సప్తమి చెప్పిన వేళకి వ్రజేశ్వరుడు దేవి చెప్పిన చోటికి చేరుకున్నాడు అతనికోసం వేయి కళ్ళతో చూస్తున్నాయి ప్రఫుల్ల కళ్ళు రెండూ

' ప్రఫుల్లా !— గడువునాటికి నీ డబ్బు తీసుకురాలేకపోయాను రెండుమూడు రోజుల్లో సర్దుబాటవుతుంది బాకీ చెల్లుకడతాను మళ్ళీ నిన్నెక్కడ కలుసుకోవాలి ?—"

ప్రఫుల్ల గొంతు పూడిపోయింది నోట మాటరాలేదు మీరు నన్నింక కలుసుకోలేరు అవకాశం దొరికినప్పుడు ఆ డబ్బు పేదలకు పంచిపెట్టండి అంతేచాలు, నాకు ' అంటూ పసిపిల్లలాగ వలవల యేడ్చేసింది

"అదేమిటి ప్రఫుల్లా, అలా అంటావ్? నిన్ను వదిలి నే నేం కాను ? ఈ పదేళ్లుగా నిన్నే ధ్యానిస్తున్నా ఇంకా ఇద్దరుభార్యలున్నా నా హృదయంలో నీదే అగ్రస్థానం నువు చనిపోయావన్నవార్తవిని నేనూ జీవితం చాలిద్దామనుకున్నా పోగొట్టుకున్న నా లక్ష్మిని ఇన్నాళ్ళకు తిరిగి సంపాదించుకున్నాను అంతే. అంతే నా లక్ష్మిని — నా ప్రఫుల్లను. ఇంటికి తెచ్చుకుని నా ఇల్లాలుగా చేసుకునే అదృష్టం నాకు లేదు

' ఏం ?"

నా ప్రఫుల్ల దొంగ — దోపిడి — బందిపోటు !

'మిమ్మల్ని ఒక్క మాట అడుగుతాను సమాధానం చెప్పండి—'పేదరాలిని నన్ను నే నెలా పోషించుకోను?' అని ఒకప్పుడు నే నడిగిన ప్రశ్నకు మీ నాన్నగారు ఏమన్నారూ ? 'దొంగతనమో, బందిపోటో చేసుకు బతుకు అని జవాబు చెప్పారు పెద్దలు చెప్పినట్టే చేస్తున్నాను జీవితంలో పరిస్థితులుకూడా నాకు దోహద మిచ్చాయి

కాని — నాకు దైవసమానులైన మీయెదట ఇప్పుడు చెబుతున్నాను



నేను దొంగను కాను, దోపిడిని కాను, బందిపోటును అంతకంటే కాను. అయితే, నేను దొంగల రాణిని అన్నది మాత్రం నిజం. కాని, ఆ దొంగసొత్తు మటుకు నేను ఒక్క పైసా అయినా ముట్టుకోలేదు. మీరు శాంతంగా వినగలిగితే, ఇప్పటి వరకు జరిగిన నా కథ యావత్తూ విన్నవించుకుంటాను. నా గోడు మీకు వలపోసుకుని, హృదయ భారం తగ్గించుకుంటాను. వినండి, మరి......"

* * *

''ఇదీ నా కథ. ఇందులో నావల్ల ఏదైనా అపరాధం వుంటే నన్ను క్షమించండి.

"ఇప్పుడు నాకోసం గొప్ప ఆపద ఒకటి కాచుక ఉంది. నాకు మీ పాద ధూళి కాస్తంత ప్రసాదించండి. ఈ జన్మకి నా కిక సెలవిప్పించండి. క్షణం కూడా ఆలస్యం చేయడానికి వీల్లేదు. ఈ చోటునించి త్వరగా వెళ్ళిపోండి. మీ వెంట నా చెలికత్తెల నిద్దర్నీ పంపుతున్నా. నా జ్ఞాపకార్థం వాళ్ళని మీ దగ్గర అట్టేపెట్టుకోండి.''

"నువ్వనేది ఏమిటి, ప్రఫుల్లా ! - నాకేం బోధపడటం లేదు. నీతోపాటు బోలెడు సిబ్బంది ఉండేవాళ్ళు కదా, వాళ్ళంతా ఏరీ ? - ఇలా నువ్వొక్క దానివే ఉండటానికి కారణం ? - ఏదో ఆపద వస్తుం దంటున్నావు. ఏమిటా ఆపద ? ఆపదవేళ రక్షణకోసం వెతుక్కోక, ఒంటరిగా ఇలా వచ్చేశావేం ? -

ఇంతలో ఏదో గుట్టుంది. చెబితేగాని వెళ్ళను."

"వెళ్ళరా ?"

"వెళ్ళను. వెళ్ళనుగాక వెళ్ళను. నా దేవిని విడిచి నే వెళ్ళను..."

అంతలోనే దూరాన తుపాకి పేలింది.

"విన్నారా తుపాకి చప్పుడు ? నన్ను పట్టడానికీ — ముట్టడించడానికీ — నన్ను ఖైదు చేయటానికీ కంపెనీ సిపాయీలు కాచుకునున్నారు. నన్నుగురించి తక్కిన వాళ్ళు చావటం నా కిష్టంలేదు. అందుకని నా మనుషులందర్నీ బలవంతాన పంపించి వేశాను. ఏదో, ఈ తుది క్షణాల్లో మిమ్మల్ని చూడగలిగాను, అదృష్టం కొద్దీ. అంతేచాలు నాకు."

"ఇప్పు డెలాగ ప్రఫుల్లా ! అయ్యో !! ఎలా అయినా ప్రాణాలు రక్షించుకునే మార్గం చూడాలి నువ్వు. నాన్నగారిని వప్పిస్తా. నిన్ను నా యిల్లాలుగా చేసు కుంటా..."

"నాకు నమ్మకం లేదు, మామగారు వప్పుకుంటారని. అయినా, ఇంతవరకు వచ్చాక ఇంకా రక్షణమార్గ మేమిటీ ? వెళ్ళండి, వెళ్ళిపోండి. మీ ప్రాణాలు దక్కించుకోండి."

"వెళ్ళను. నేను నీ భర్తను, నిన్ను రక్షించవలసిన బాధ్యత నాది. నన్ను గురించి నా కేం బాధలేదు."

"మీకు తెలియని మరొకసంగతి చెబుతా, వినండి: ఇప్పుడు కంపెనీ సిపాయీలతో మీ నాన్నగా రున్నారు నేను పట్టుబడకపోతే ఆయనకిప్రమాదం మీరు నాతో బా టుంటే, కంపెనీవారు మిమ్మల్ని అనుమానిస్తారు కనుక నన్ను వొదిలి వెళ్ళిపోండి. ముందు మీ రక్షణ సంగతి చూసుకోండి."

"ఏమిటీ !— మా నాన్నేనా, వాళ్ళకి రహస్యంచెప్పి మద్దతుచేసిందీ ?— ఆయన గారేనా కూపీ అందించింది ?"

దూరంలో భేరీధ్వని.

* * *

దేవిరాణి ముఠాకీ, కంపెనీ సిపాయీ లకూ దొమ్మీ జరుగుతూంది !

జరుగుతున్న దొమ్మీ జరుగుతున్నట్టు గానే నిలిచిపోయింది !! — కారణం ?—

దేవిరాణి పడవమీద ఎవరో తెల్ల జెండా చూపించారు.

* * *

"దొంగలరాణి దేవీ చౌధరాణి కంపెనీవారి వశం కావటానికి వప్పు కుంది. ఒక్క దేవిరాణితప్ప తక్కిన మరెవ్వరూ మీకు స్వాధీనం కారు. పడవ మీది ధనంగాని, మాలో ఒక్కరమైనా సరే మీకు దొరకరు. ఇది మా దేవీ పంపిన వర్తమానం'' అంటూ విన్న వించాడు, దేవిరాణి మనిషి — రంగరాజు

చేతిలో మిగిలిన ఐదువందలమంది సిపాయిలతో యుద్ధం చెయ్యటం కష్టమని తెలుసుకున్నాడు దొర. కాళ్ళ దగ్గరికి వచ్చింది బేరం.

"అదంతా నాకు తెలీదు మీరు ఓడి పోయారు అపడవ నాది నేనిప్పుడే స్వాధీన పర్చుకుంటాము" అన్నాడు. దొర

"తొందర పడకండి ప్రమాదం— ప్రమాదం ''

"అహహహహ!— మేం అయిదు వందల మందిమి, మీరు ముగ్గురు. ఆఫ్టరాల్ ముగ్గురు; త్రి పీపుల్, మీ చేతిలోనా మాకు ప్రమాదం!— హహహహ్హా!!— ఇదుగో, వెంటనే పడవ ముట్టడించండి, పడవమీద ఎవరి దగ్గర ఆయుధా లున్నాలాగివెయ్యండి.." హుషారుగా హుకుంలు జారీచేస్తున్నాడు దొర.

ఈమాట వింటూనే పడవమీదిబలగం చేతుల్లో ఆయుధా లన్నీ నీళ్ళలో విసిరి పారేశారు.

ఇక పడవ ముట్టడించవలసిన అవసరమే లేకపోయింది. దొరికికూడా సైన్యాన్ని తీసుకెళ్ళాల్సినబాధ తప్పింది. ఒకేఒక్క సిపాయిని ఆయుధాల సహితంగా వెంటబెట్టుకుని, "పడవమీద ఏముందో చూదాం, పద?" అంటూ బయల్దేరాడు.

* * *

మోటచీర, మోటగాజులు, విరబోసుకున్న జుట్టు - ఇలా మామూలు వేషంలో వున్న దేవీ దొరగారి దృష్టిని ఆకర్షించలేకపోయింది.

లోపలికి వచ్చి కూచున్నాడు దొర ఎదురుగా ఇద్దరు స్త్రీ లున్నారు "మీలో దేవీ చౌధరాణి ఎవరు ?" - అని అడిగాడు దొర

"నేనే దేవిని నాతో మాటాడండి" అంది నిశి - దేవి చెలికత్తె

"మా చెల్లెలికి కాస్త వేళాకోళం ఎక్కువ. పరిహాసానికి అలా అంటుంది. మీరు నాతో మాటాడండే. నేనే దేవీ చౌధరాణిని" అంది దివ, మరొక చెలి.

"దొరగారు!— ఇది నా చెల్లెలు. నన్ను రక్షిద్దామన్న ఉద్దేశంతో అలా అంటుంది. మేం బంగాళా స్త్రీలం. మాకు ప్రాణమంటే లెక్కలేదు. దాని మాటలు నమ్మకండి. లేవండి పోదాం. నేనే చౌధరాణీని'' అంది నిశి.

"అయ్యో!— మీ ఏసుక్రీస్తు సాక్షిగా మీరు నిరపరాధులను పట్టుకోకండి. నేనే దేవీని.''

విసుక్కున్నాడు దొర.

"నువు చెప్పు - ఇందులో దేవీ రాణి ఎవరు, నిజంగా ?" అంటూ రంగరాజు నడిగాడు.

రంగరాజు నిశివేపు చూపించి, "హుజూర్ !— అసలు దేవీరాణి ఈమె" అన్నాడు.

దేవీరాణి ముందుకు వచ్చింది. "అయ్యో!— మధ్యలో మాటాడుతున్నందుకు నన్ను క్షమించండి, అబద్ధాలు చెప్పటం వల్ల అందరికీ ఆపద వస్తుం



దని నేను జోక్యం కలిగించుకుంటు న్నాను. మీ క్కిద్దరిలో ఎవరూ దేవి కాదు. అసలు దేవీని నేను. నేనే దేవీ చౌధ రాణీని."

లెఫ్టినెంటు దొర నమ్మలేదు. నిశి. దివ - ఇద్దరి వేపూ చూసి, "నేను నమ్మను. మీ ఇద్దరిలోనే ఎవరో ఒకరు దేవీ అయుండాలి. నాముందు దాస్తున్నారు. ఇప్పుడు మిమ్మల్నిద్దరినీ తీసుకపోతాను. మీలో చౌధరాణీ ఎవరో వారు ఉరి తీయ బడతారు. అప్పటికీ తేలకపోతే, ఇద్దర్నీ కలిపి ఉరితీస్తాం, తెలుసుకోండి!- అని బెదిరించాడు.

నిశి, దివ మళ్ళీ ఇలా అన్నారు:

"పోనీండి దొరగారూ!- మరొక చిన్న ఆలోచన చెబుతాం, వింటారా? ఒక పని చెయ్యండి. దేవీని మీకు పట్టిస్తా మన్న కూపీదారు ఉన్నాడుగా? అయన్ని పిలిపించండి. రాణీ యెవరో ఇట్టె గుర్తు పట్టి చెప్పగలడు..."

ఈ ఉపాయం దొరకి నచ్చింది. కూపీ

దారైన హర్షవల్లభుడికోసం వెంటనే కబురు పంపాడు

* * *

హరవల్లభుడికి పచ్చి వెలక్కాయ గొంతున పడ్డది. లెఫ్టినెంటు దొర నిశనీ దివనూ చూపించి, "ఈ యిద్దరిలో దేవీ రాణి ఎవరు ? చెప్పు. ఇందులో దేవీ చౌధరాణీ ఎవరు ?— ఊఁ...'' అంటూ గద్దించాడు.

పద్మవ్యూహంలో చిక్కుకున్నట్టయింది హరవల్లభుడికి. ఎటూ చెప్పలేక పోయాడు. ఏమీ చెప్పలేకపొయ్యాడు.

మరొకమాటు అడిగాడు దొర.

దివను చూపించాడు హరవల్లభుడు. ఫక్కున నవ్వింది నిశ. 'అయ్యో, పొరపాటు !' అని చెప్పి ఈసారి నిశని చూపించాడు. పకపక నవ్వింది దివ. కంగారుతో హరవల్లభుడు మళ్ళీ నిశని చూపించాడు.

ఉగ్రుడయ్యాడు దొర.

"యు ఫూల్ !— నీకే తెలియదా, దేవీరాణీ ఎవరో ?"

దివ సలహా యిచ్చింది — "కోపం చేయకండి దొరగారూ !— ఈయన గుర్తించలేకపోతే పోనీండి. వీరి అబ్బాయిని పిలిపించండి. ఆయనైతే చక్కగా గుర్తించగలడు."

అంతటి అవమానంలోనూ హరవల్లభుడు ఆశ్చర్యపోయాడు.

వ్రజబాబుని పిలిపించమన్నాడు దొర

* * *

వ్రజేశ్వరుడు వచ్చాడు.

''ఈ యిద్దరిలోనూ దేవీ లేనేలేదు వీరు రాణీ దాసీలు'' అన్నాడు.

కూపీదారు నాలిక కొరుక్కున్నాడు

కోపంతో దొర, ''అయితే, ఆ దాసి వేషంలో వున్నదే దేవీ అయివుంటుంది అవునా ?'' అన్నాడు.

"నాకు తెలీదు, ఆ మాత్రం తెలిపిన వాడివి, నువ్వే వెతుక్కోలేకపోయావా? మధ్యని నేనెందుకూ ?—"

ఇంతలో—

పెద్ద పెట్టున శంఖారావం విన వచ్చింది. "తుఫాను ! తుఫాను !!' అని జమాదారుడి కేకలు వినబడ్డాయి తుఫాను గాలి రివ్వుమని వచ్చి, దొర కొక చెంపపెట్టు పెట్టింది. తల తిరిగినట్టయింది దొరకి. కోపం రెచ్చింది

యూ- ఫెలో !— నువు కూపీదారువి కావా ?—" అంటూ, వ్రజబాబు పైన కళ్ళెర్రజేశాడు.

''ఎవరు కూపీదారూ ? మళ్ళీ అను ఆ మాట...'' అని, ఠపీమనీ ఒక్క చెంపకాయ వేశాడు, వ్రజబాబు.

బలంగా పిడికిలి యెత్తాడు, దొర

అయితే—పక్కకి ఒరిగింది పడవ దివ పాదాల దగ్గర పడ్డాడు దొర దొర మీద వ్రజబాబు పడ్డాడు. నిశమీదపడిన




"ఏమయినా కంప్లైంటు చేస్తున్నారా !"

హరవల్లభుడు దొర్లుకుంటూ పోయి, రంగరాజు పాదరక్షల దగ్గర ఆగాడు.

కొంచెంసేపటికి స్థాయిలో పడింది పడవ. అంతా లేచారు; ఎవరి స్థానంలో వారు కూచున్నారు. దొర బయటికి చూశాడు, తీరాన్ని వదిలిన పడవ పది ఆమళ్లదూరం వచ్చేసింది. వాయువేగంతో నీళ్ళను దూసుకుపోతూంది. దొరకి ముచ్చెమటలూ పోశాయి.

దొంగల్ని పట్టవచ్చిన దొరగారూ, కూపీదారూ దొంగలకే బందీ లయ్యారు.

* * *

"కాస్తంత విశ్రాంతి తీసుకోండి'' అంది, విశి.

"నిద్ర రావటంలేదు."

"నిద్రపోవాలంటే మళ్ళీ నీకు సమయం దొరకదు."

"ఏం ? "

"ఇదే నీ జీవితంలో ఆఖరురాత్రి.''

''ఆఁ?—''

''ఏం. ఆశ్చర్యంగా వుందా ?— నీ జమీందారీ పోతోందంటే డబ్బిచ్చి నిన్ను రక్షించింది, నీ పరువు దక్కించింది, నీకు జైలుశిక్ష తప్పించింది ఎవరను కున్నావ్ ?— మా దేవీరాణీ. అందుకు ప్రత్యుపకారంగా ఈ కూపీదారు పనికి వప్పుకున్న నిన్నేం చెయ్యాలి ?— నీ కేశిక్ష తగుతుందో నువ్వే చెప్పు."

హరవల్లభుడికీ నోట మాట రాలేదు.

మళ్ళీ అన్నది నిశి; "అందుకే చెబుతున్నా. హాయిగా నిద్రపొమ్మని. మరొక రాత్రి చూసేభాగ్యం నీకులేదు. ఇప్పుడు పడవ ఎక్కడికి పోతోందోతెలుసా ? ''

మాటాడలేదు కూపీదారు.

"పోనీలే. తెలీకపోతే చెబుతా, విను: శ్మశానానికి—ప్రాణాలతో దొరికిన బందీలను అక్కడికి తీకుసుపోయి చంపేస్తాం. లెఫ్టినెంటు దొరగారిని ఉరి తియ్యమని మా రాణీగారి ఆజ్ఞ. మరి, నీ సంగతి ఏం చెప్పారో తెలుసా ?"

వలవల యేడుస్తూ, చేతులుజోడించి, ''అమ్మా!—రక్షించు, నన్ను..రక్షించు." అన్నా డాయన.

"నిన్ను రక్షించే మహాపాపి ఎవడుంటాడు ?— నీకు శూలం దిగ్గొట్టమని తీర్పు చెప్పారు.''

గోడుగోడున విలపిస్తూ అన్నాడు. "అమ్మా !— నీ మేలు మరచిపోను. నీ కో లక్షరూపాయ లిస్తాను. రక్షించు. నన్ను రక్షించి పుణ్యం కట్టుకో !—"

"లక్షరూపాయ లిస్తావేం ?— యాభైవేలకే — మా డబ్బు మా కివ్వటానికే — ఇంత ఉపకారం చేశావు, లక్షరూపాయల కింకెంత చేటు తెస్తావో !—''

"నువ్వేం చెబితే అది చేస్తాను. నే నేం చేయగలననే మాట వొద్దు. ప్రతి ప్రాణివల్లా ఏదోఒక ఉపయోగ ముంటుంది. నా కేం పని చెప్పినా చేస్తాను. నా ప్రాణాలు కాపాడు."

"అయితే నా కొక పనివుంది. కా—ని— నీలాంటి వాడిచేత అలాంటిపని చేయించటమూ.నా కిష్టంలేదు...''

''చెప్పు. సందేహించకు. చేస్తా, ఏ పనైనా చేస్తాను.''

"నువు జూదగాడివి, దొంగవు, విశ్వాసం లేనివాడివి, నీ మాట ఎలా నమ్మటం ?''

"ఏ వొట్టు కావాలంటే ఆ వొట్టు వేస్తా, చెప్పు.''

''నీ కొడుకు తలమీద చెయి పెట్టి ప్రమాణికం చేస్తావా ?"

''ఆ మాట మాత్రం వొద్దు. నాకు ఒక్కగా నొక్క కొడుకు. మ రేప్రమాణమైనా సరే చేస్తా."

"పోనీ, వొద్దులే. భయపడకు. నువు మా పిడికిట్లో వుండగా ప్రమాణం అవసరం లేదులే. మా చెల్లె లొక ర్తె వుంది. ఇరవై ఏళ్ళపిల్ల. ఇంకా పెళ్ళి కాలేదు. దాన్ని నువు పెళ్ళి చేసుకుంటే మా తండ్రి వంశం నిలబడుతుంది, నువ్వీపని చేయగలిగితే, నీ ప్రాణాలు కాపాడమని రాణీగారిని కోరుతాను."

ఆలోచనలో పడ్డాడు హరవల్లభుడు.

"నేను ముసలివా ణ్ణయిపోయాను. ఇప్పుడు పెళ్ళేమిటి నాకు ? పోనీ, మా అబ్బాయి కిచ్చి చెయ్యరాదు ?—"

''అబ్బాయికా ! వప్పుకుంటాడా ?—"

"తప్పకుండా. నా మాట కెదురు చెప్పడు...''

తుఫానూ ఆగింది. హరవల్లభుడి మనస్సులో తుఫానూ వెలిసింది ఆయితే, దొరగారికి మాత్రం ప్రాణాలు ప్రాణాల్లా లేవు ఇద్దరు అంగరక్షకులు ఆయన్ని వెంటబెట్టుకుని వెళుతూవుంటే హరవల్లభుడు అడిగాడు ''దొరగార్ని ఎక్కడికి తీసుకుపోతున్నారూ ?''

"అడవిలోకి వారిని ఉరి తియ్యమని ఆజ్ఞ అయింది "

తరవాత రంగరాజు దొరని తీసుకుపోయి ఒకచోట నిలబెట్టాడు ''ఇదిగో-భయపడకు ఇంద - నీకు నూరు మొహర్ల త్రోవ ఖర్చు కోసం యివ్వమని ఆజ్ఞ అయింది. ఇవిగో, తీసుకో ఇంకెప్పుడూ మా వెంటపడకు బుద్ధి కలిగి మెసులుకో మరొక్క మాట—మావల్ల మీ సిపాయి లెవరైనా గాయపడితే ఇక్కడికి పంపించు ఒక వేళ ఎవరైనా చచ్చిపోతే, వాళ్ళ వారసుల్ని పంపు మాకు చేతనైన సాయం చేస్తాం'' అని చెప్పి అతన్ని సాగనంపాడు

*　　*　　*

''నాయనా, వ్రజా !— ఇక్కడికి నువ్వెలా వచ్చావో ఇంకా నాకు తెలియటంలేదు ఏమైతేనేం, ఇద్దరం ఒక దగ్గరికి చేరుకున్నాం అదే పదివేలు

"లోకంలో తప్పు చెయ్యని వాడు ఎవడు? ప్రతి మానవుడూ పొరపాటు చేస్తూనేవుంటాడు నావల్ల ఒక పొరపాటు వచ్చింది అందుకు ప్రాయశ్చిత్తంగా ఒక మాటకు నేను కట్టుబడాల్సి వచ్చింది నువ్వూ ఇంకా సంసారం కుదుటబడక ఇబ్బందిపడుతూనే వున్నావు ఇప్పుడు నీ కొక చక్కటి సంబంధం వచ్చింది ఈ సంబంధం నువు చేసుకునే తీరాలి "

వ్రజేశ్వరుడు మౌనంగా అంగీకారం సూచించాడు

*　　*　　*

'వ్రజేశ్వరుడు మరొక పెళ్ళి చేసుకున్నాడు పిల్ల కాస్త వయసుదయినా చక్కని చుక్క. బుద్ధిమంతురాలు కొత్త కోడలు అచ్చు మచ్చు పెద్ద కోడలు ప్రఫుల్లముఖిలాగే వుంటుంది ఈమెను చూసి ఆమెను చూడ పనిలేదు ఇల్లు నిండిన కోడలు 'అని ఈ ధోరణిలో నలుగురూ నాలుగు విధాల చెప్పుకున్నారు

"ఎక్కడ దొరికిందిరా నాయనా, మన కీ లక్ష్మీదేవి ?'' అని అడిగింది వ్రజబాబు తల్లి

"ఇది కొత్త లక్ష్మి కాదమ్మా, లోగడ నే పోగొట్టుకున్న ప్రఫుల్లముఖే !—''

*　　*　　*

''విన్నారా !— ఈ పెళ్ళి కొత్త పెళ్ళి కాదుసుమండీ; ఇప్పుడు వచ్చిన కోడలు మన పెద్దకోడలే !—'' అన్నది యజమానురాలు, హరవల్లభుడితో



"ఆ(:_ మన పెద్దకోడలా? ఏం మాట? అది చచ్చి పదేళ్ళయిందికదే?_"

"అవన్నీ మీ కేం తెలియవులెండి, చెప్పినా అర్థంచేసుకోలేరు. అందుచేత ఈ గొడవ మళ్ళీ చర్చ చేసి రచ్చ కెక్కించకండి. నా భర్తా, నా బిడ్డా మళ్లీ నాకు దక్కటం అంతా నాకోడలి చలవే. ఈమాటు దా న్నేమైనా అన్నారో, నే నూరుకునేది లేదు. నుయ్యో గొయ్యో చూసుకుంటా..."

"అదంతా దేని కిప్పుడూ? లోకు లంతా ఈమెని కొత్తకోడ లంటున్నారు. నువ్వూ అలాగే అను. పాత పురాణాలు తిరగదోడక..."

ఎప్పుడూ పుట్టింటనే వుంటున్న సాగర్ బహూ, నయనతారా కొత్త సవ తిని చూడవచ్చారు. చూచి పోదామని వచ్చిన ఆ యిద్దరూ అత్తవా రింటనే అతుక్కుపోయారు. ఇద్దరూ యిప్పుడు ప్రఫుల్ల అంటే ప్రాణం పెడతారు.

ఈనాడు ఇంట్లో వంటా పెట్టూ అన్నీ చూడవలిసింది ప్రఫుల్లే. ప్రఫుల్ల వండకపోతే, ఆవేళ ఎవళ్ళకూ భోజనం సరిపడదు.

ఇక _ జమీందారీ వ్యవహారాల్లోనూ అంతే. కోడలు ఇంటో కాలు పెట్టినప్పటి నుంచీ లక్ష్మి సముద్రంలా పొంగి పొర లింది. ఏదేనా సమస్య వస్తే ఇంటి యజ మాని, "నా కేం తెలుస్తుందీ, మన కొత్త కోడల్ని, అడుగూ" అని చెప్పి తప్పు కుంటాడు!_



"ఇప్పుడై మెంతైందో తెలుసా? — ఒంటిగం టైంది చూడు! — పదింటికే మా ఇంట్లో భోజనా లైపోతాయి — నువ్వేమో రోజూ ఇలాటప్పుడు ఆఘోరిస్తావు — ఫో."

"సిత్తం — పోనీ ఒక సిన్న రిస్టువాచీ ఇప్పించండి బాబయ్యా! ఏళ కొస్తాను!"



"అబ్బాయ్! మీ గురువుగారు వేసే బొమ్మల మొఖా లన్నీ ఒక్కలాగే వుంటాయేం?..."

"మా గురువుగారు ఏకపత్నీవ్రతు లండి పాపం!"

# చవితి చంద్రుడు

"అన్నీ మీ అన్నయ్య బుద్ధులే" అన్నాడు గోపాలం.

ఈ మాట గోపాలం ఎప్పుడన్నా రుక్మిణి మాట్లాడదు. మాట్లాడలేక పోవడానికి కారణం ఆమెకూ తెలియదు. తెలిసింది చెప్పడానికి తగ్గ మాటలు కంఠంలో ఆగిపోతాయి తప్ప బయటకు రావు. ఆగిపోయిన మాటలు ఆమె - భర్త నిద్రపోతున్న క్షణంలో గుర్తుకు తెచ్చుకుంటూ వుంటుంది. యెవరూ విననప్పుడు పైకే అనుకుంటుంది. చాలాసార్లు అలా అనుకున్న తర్వాత తన నెవరో వోదార్చినట్టుగా వుండేది.

గోపాలం మాటలకు రుక్మిణి జవాబు చెప్పకపోయినా కొడుకు ప్రకాశం మాత్రం జవాబుగా యేడుస్తూనే వున్నాడు. ప్రకాశం యేడవడానికి కారణం అతను స్కూలుకు వెడుతూ తండ్రి జేబులో పావలా చెప్పకుండా కాజెయ్యడం, పైగా ఆ విషయం అడిగితే తియ్యలేదని అనడం గోపాలానికి చిరాకు తెప్పించింది. ఆ అనుమానానికి ఆజ్యంగా పనిచేసింది- కొడుక్కన్నీ మేనమామ శివరావు బుద్ధులు అబ్బుతున్నాయనే భయం. అందుకే కొట్టాడు.

"వెధవ తీసుకున్నానని చెప్పకూడదూ." అది గోపాలం వాదన.

"నే నిజంగా తియ్యలేదు."

"పోనీ తియ్యలేదేమో-వూరుకోకూడదూ" అంది పైకి రుక్మిణి. కానీ లోపల అనుకుంది "వాడి నెందుకు అన్నయ్యతో పోలుస్తా"రని బాధగా.

రుక్మిణికి అన్నయ్య శివరావు అంటే తండ్రికన్నా గౌరవం. అన్నగారితో కలిసే రుక్మిణి యెలిమెంటరీ స్కూలు నుంచి హైస్కూలువరకూ-చెల్లాయిగా-స్నేహితురాలిగా-తల్లిగా- ఆరిందాగా నడిచి వెళ్ళింది.

పాఠాలు చదవలేక నిద్ర ముంచుకొచ్చిన రాత్రి, హోంవర్కు లెక్కలు తికమక పెడ్తూంటే - తాటాకు బొమ్మలు అందంగా అమరకపోతే, శివరావు ఆమెకు గోడమీద ఫొటోలో భద్రాద్రి రాముడిలా కన్పించేవాడు

తల్లి తిడితే, అన్నయ్యలు కోప్పడితే కోపంతో చూస్తూంటే చిన్నరుక్మిణి
వెళ్ళి శివరావుతో చెప్పి యేడ్చేది. 'మా అన్నయ్య' అనుకునేది.
అన్నయ్య వెళ్ళి తల్లివైపు అర్భకపు అలాంటి అన్నయ్యతో తన చదువు



ఫోర్తుఫారంతో దూరమయింది. తల్లీ దండ్రీ కలిసి చదువు మాన్పించిన రోజున-రాత్రి తను కార్చిన కన్నీరు యింకా గుర్తుకు వస్తూనే వుంటుంది. తనతోపాటు అవతలి గదిలో అన్నయ్యా కూడా అలాగే తెరిచిన పుస్తకం తడిసిపోయేటట్టు కన్నీరు కార్చాడని తెలిసి - లేచి వెళ్ళి 'పోనీ లే అన్నయ్యా' అనా లనుకుంది. కానీ శివరావే వచ్చి అన్నాడు.

"పోనీవే- నే స్కూల్లో చదువుకు వచ్చి నీకు ప్రతి సాయంకాలం పాఠాలు చెబుతాను, చదువుకుంటూ వుండు."

భయంగాచూసింది తను.

"యెవరితో చెప్పనులే" అన్నాడు నవ్వుతూ.

ఉదయం వొంటరిగా స్కూలుకు వెళ్ళలేక శివరావూ- వొక్కత్తే వాకిట్లో కూర్చుని రుక్మిణీ — గాలి పటాల్లాంటి వూహాలుమాత్రం అల్లుకో సాగారు... అప్పుడే శివరావుకు కొత్త స్నేహితుల పరిచయం కల్గింది. కబుర్లు చెప్పడం గ్రౌండ్ కు వెళ్ళి ఆటలు ఆడ్డం అలవాటయ్యాయి....

యెదిగీ యెదగని వయసులో స్నేహితుల ప్రభావం ప్రతి విద్యార్థి మీదా పనిచేస్తూనే వుంటుంది. ఆ పని ప్రవాహంలోనే కొత్త అలవాట్లు నేర్చుకోవడం - పాతవి తెలియకుండానే కొట్టుకుపోవడం జరుగుతుంది. ఆ అలవాట్లే మనిషిని జీవితాంతం వేపుకు తింటాయని అనుకోకపోయినా - మనిషి మరోమలుపు తిరిగేవరకూ — జీవితం కుబుసం విడిచేవరకూ మాత్రం మనసుమీద పనిచేస్తాయని వొప్పుకు తీరాలి.

చలపతి హైస్కూల్లో ప్రవేశించకుండానే చెడుతిరుగుళ్ళకి - బీడీలు కాల్చడానికి అలవాటుపడ్డ వ్యక్తి. ఆ అలవాటు - చిన్నప్పుడు చలపతికి ఉబ్బసం వస్తే డాక్టరు చుట్ట నేర్పమనడంతో - పక్కన కూర్చోబెట్టుకుని తండ్రి కాల్పించేవాడు. కొంతకాలానికి జబ్బు మాయమయింది గాని చలపతికి అలవాటు యెదిగి కూర్చుంది.

అందుబాటులో వుండే తండ్రి చుట్టపెట్టె అందకుండా తాళం వున్న అల్మారాలో పెట్టి నిద్రబోతున్నా—తల్లి గారం అందుతూవుండడం మూలంగా చలపతి కొంతకాలం మామూలుగానే వున్నాడు.

కానీ తనిచ్చే అణాల వెనుకచరిత్ర తల్లి పసిగట్టడంతో కొడుక్కి యిచ్చిన చనువు వెనక్కి తీసుకుంది.

చలపతి మాత్రం - యిరుకయిన దార్లో నడవలేని పాదాల్లా — నొండి ఆటలో అవుట్ చెయ్యలేని కుంటి వాడుగా — పాఠంరాని విద్యార్థిలా

తికమకపడ్డాడు. ఆ తికమకే అతన్ని చిన్నరకం జేబు దొంగతనానికి - అదీ యింట్లో - అలవాటు చేసింది. సరిగ్గా యీ సమయంలోనే - తండ్రి జేబులో మర్చిపోయిన అణాలూ - డార్లో దొరికిన పావలా కాసులా, శివరావు స్నేహం అనుకోకుండా లభించింది.

శివరావుకు చెయివాటుతనం అలవాటు చేకూరిందని చలపతి అనుకుంటే అది పొరపాటవుతుంది. చలపతి వో వారంరోజులు దాటిన తరువాత - తన అలవాటు ప్రకారం శివరావు జేబులో బేడ తీసుకుని గప్‌చిప్పుగా వూరుకున్నాడు. స్కూలునుంచి తిరిగి వచ్చేటప్పుడు చలపతి, "హోటల్‌కు వెడదాం రా" అన్నాడు. శివరావు తనదగ్గర డబ్బు ల్లేనందుకు - బేడ పోయినందుకు వుదయంనుంచీ బాధ పడుతూనే వున్నాడు. నిజానికి అతను చలపతిని అనుమానించాడు. కానీ అడగలేక, మొహమాటంకొద్దీ పోయిందని కూడా చెప్పలేకపోయాడు.

ఇద్దరూ కాఫీ తాగిన తరువాత నాలుగణాలు చలపతే చెల్లించాడు. అలవాటు ప్రకారం సిగరెట్లు కూడా కొన్నాడు.

వొక్క బేడమాత్రం చలపతి జేబులో వుంటుందనీ, బహుశా అది తనదే ననీ తర్కవితర్కం చేసుకుంటున్న శివరావు-అతను ఆరణాలు ఖర్చు పెట్టడంతో - తన బేడ దొంగిలించింది చలపతి కాదనుకున్నాడు.

ఓ రోజు సాయంకాలం చలపతి శివరావును "పావలా కావాలిరా" అని అడిగాడు.

"నాదగ్గర బేడ వుంది" అన్నాడు అమాయకంగా శివరావు.

"నాకూ తెలుసు నీ దగ్గర బేడ వుందని - అది చాలదు."

"మరి యెలా ?"

"మీ నాన్నగార్ని - పోనీ అమ్మగార్ని -"

"నా న్నివ్వరు. ఇది అమ్మిచ్చిన బేడే... మళ్ళీ యివ్వదు."

"చెల్లాయి...."

"దానిదగ్గర డబ్బు లుండవు."

చలపతి శివరావును చూసి నవ్వి అన్నాడు "మీ నాన్నగారి జేబులో వుంటాయి."

"మనదగ్గర వుండగా - అయినా దొంగతనం తప్పు" అన్నాడు.

"ఇది దొంగతనం కాదురా శివం. నీ దగ్గర రూపాయి వుండగా నీ అవసరం రూపాయిపైన వుంటుంది. మిగిలింది సంపాదించాలికదా. పైగా నీదగ్గర రూపాయి వుండడం మూలంగా మిగిలింది నువ్వు యెత్తుకు పోయావని యెవరూ అనుకోరు కూడా." అని అంతవరకూ తనింట్లో పట్టుబడకుండా యెలాతప్పించుకునేదీ,

యెలా డబ్బులు బయటకు తెచ్చేదీ చెప్పాడు.

అంతే. తండ్రి నియమాలమధ్య - వోట్టి ఆప్యాయతగా చూసే తల్లిమధ్య అలా శివరావుకు చిన్నరకం దొంగ తనాలు అలవాటయ్యాయి. తరువాత అది గట్టి అలవాటే అయిందికూడా.

శివరావును యింట్లో వాళ్ళందరూ అనుమానించిన రోజూ, తిట్టిన క్షణం తనే ఆ చెడుపని చేసినట్టు యేడ్చేసింది రుక్మిణి. కానీ వో రోజు పరీక్షగా చూసింది. అంతకుపూర్వం అన్నగారి జేబులో వున్న అర్ధరూపాయి - రూపా యిగా మారింది. అన్నగార్ని యెలా అడగాలో, నిలదియ్యాలో ఆమెకు తెలియలేదు. పైగా చిన్నదాన్ననే వయసు ఆమెను శివరావుకు దూరం చేశాయి.

రుక్మిణికి పెళ్ళయి కాపురానికి వెళ్ళవలసిన రోజు-శివరావు కాలేజీలో చేరవలసిన సమయం వో కే సారి వచ్చాయి. వీలు చూసుకుని అన్న య్యతో మాట్లాడాలని ఆమె నిశ్చయం చేసుకుంది.

తన ప్రాణంలో ప్రాణం - తన వూహాలకు రంగులు పులుముకుంటే- రెక్క లిస్తే - అందంగా అలంకరిస్తే మొదట ఆమెకు ఆరాధ్య దైవంగా అన్నయ్యే కనిపిస్తాడు. అలాంటి అన్నయ్య మచ్చగా - మసకలో నడ వడం గుర్తొచ్చి మెలుకువలో-నిద్రలో దేవుణ్ణి నిందించాలో -అతనిలోమార్పు కోసం ప్రార్థించాలో మర్చిపోయింది.

"అన్నయ్యా! మా వూరు వస్తూం టావా అప్పుడప్పుడు?"

"వో!"

"అన్నయ్యా!"

"ఆ...."

"అమ్మ నీ గురించి బాధపడు తోంది రా."

"యెందుకుట ?"

రుక్మిణికి యెలా చెప్పాలో తెలియ లేదు. "వుత్తరం వ్రాస్తాను" అంది అదోరకంగా.

"ఫరవాలేదు చెప్పు...."

"నువ్వు చిల్లర దొంగతనాలు మానెయ్యవూ" అంది వెంటనే.

తడబడుతూ అన్నాడు "ఛా-ఛా- నే దొంగతనం చెయ్యడ మేమిటి" అని.

"నాకు తెలుసు - అదిగో అబద్ధం దేనికి" అంది యేడుపు ఆపుకోలేక అవతలిగదిలోకి వెళ్ళిపోతూ.

మనిషి తప్పు చేసినా యెవరూ గుర్తించలేదనుకున్నప్పుడు బ్రతుకులో వంకర లన్నీ మర్చిపోయి నిటారుగా నడుస్తాడు. అది యెదటివాడు గుర్తిస్తే సగం వంగిపోతాడు. శివరావు స్థితి అంతే అయ్యింది.

శివరావు అలాగే కూర్చుండిపోయి భయంగా గొణుక్కుంటూ "దీని కెలా



కాకా గారు వీరేనండి వీరి పూర్తిపేరు కాంతాకనకనేని కామకోటీశ్వరరావు అని చాలామందికి తెలవనే తెలవదు కాకాపట్టి వ్రాయడంలో వీరికి వీరే సాటి!"

తెలిసిందబ్బా" అనుకున్నాడు మరునాడు కాలేజీకి వెడుతూ యెవరితో నైనా చెబుతుందేమో" లోపల అనుకున్నాడు. చలపతిని చూడగానే వో గంట కబుర్లు చెప్పగానే "నే అంటే దానికి అభిమానం వుంది. యెవరితో యీ విషయం చెప్పివుండదు" అని నిర్ధారణ చేసేసుకున్నాడు.

ఆ నిర్ధారణ కొచ్చిన మూలంగా - శివరావు మానసిక జాడ్యం హరించుకు పోవడంబదులు హెచ్చు పెరిగిపోయింది. తరుచు హాస్టల్లో యెవరో వొకరి జేబుల్లో డబ్బులు దొంగిలిస్తూనే వున్నాడు.

నిజానికి శివరావుకు అదోగ్లామరూ, హాబీ అయిపోయింది. ఆ హాబీకి వంత పాటగాడు చలపతి. తమకు యింటి దగ్గరనుంచి వచ్చిన డబ్బు విచ్చలవిడిగా టేబిల్ మీదా పుస్తకాల్లోనూ పడెయ్యడం-ఆ డబ్బును విలువలేనిదానిగా చూసి నటనగా తిరగడం మొట్టమొదటి మొట్టు. తద్వారా యెవరూ వీళ్ళని అనుమానించేవారు కారు.

పక్క రూమ్స్‌లో వాళ్ళు హడావిడిగా వున్న సమయాల్లో వాడిదగ్గర నుంచి వొకటీ రెండూ కాజెయ్యడం-వాడు యెలా పోయిందనే ప్రశ్నను విప్పుకోలేక బాధపడుతూంటే - చాటుగా వుమ్మడిగా యిద్దరూ నవ్వుకునేవారు. అది వారి ఆనందానికి ఆఖరిమెట్టు.

యీ విషయం మొదట పసిగట్టిన వాడు రఘురాం అని వో ఫైనలియర్ స్టూడెంట్. జేబులో పదిరూపాయల

నెంబర్స్ నోట్ చేసుకుని అత నో రోజు ట్రిక్ చెయ్యడం - యథావిధిగా శివరావు ప్రవర్తించడం జరిగిపోయాయి. దానికి తోడు శివరావు రఘురాంని కూడా కాఫీకి ఆహ్వానించాడు.

ఆ సాయంకాలం రఘురాం వెరిఫై చేసుకుంటే నిజం తేలింది. రఘురాం రోజంతా ఆలోచించాడు. మనిషి అవసరం తీరక అవకతవక పన్లు చేస్తాడు. ఆ అవసరం మరీ భయపెడితే భయంకరమైన పన్లు కూడా చేస్తాడు. అంతవరకూ తెలుసు.

కాని శివరావు దగ్గర స్వంతం అనేది కొంత వుండడం-పైగా అనవసరపు దొంగతనంలోని ఆవశ్యకత యేమిటో అతనికి రాత్రిచాలా సేపు ఆలోచించినా అంతుచిక్కలేదు. మరునాడు యిద్దరు ముగ్గురు స్నేహితులతో చెప్పినా యెవరూ నమ్మలేదు. కొందరు శివరావును వెనకేసుకొచ్చారు. 'స్టడీస్'లో నీ'రేంక్'ని మించిపోయాడని ఈర్ష్య అన్నారు.

అప్పటికే బావమరిది ప్రవర్తన గురించి విన్న గోపాలానికి-రఘురాం-సంశయనివృత్తికోసం చెప్పిన కథ బాధే కాదు, అవమానాన్నికూడా కల్గించింది.

రఘురాంకు గోపాలం వరసకు అన్నయ్య అవుతాడు. అన్నీ చెప్పి ఆఖర్ని అన్నాడు.

''క్షమించు అన్నయ్యా...శివరావు నీ బావమరిది అని తెలుసు-కానీ....''

రఘురాం అబద్ధం ఆడ్డంలేదని గోపాలానికి తెలిసింది .... అందుకే అన్నాడు....

''శివరావు పూర్తిగా దొంగ అని నేనూ నమ్మలేకపోతున్నాను. అతనికి అదో అలవాటు. చిన్నతనం నుంచీ మనిషిలో అవసరాల్ని నొక్కిపెట్టాలనుకుంటే మానసిక ప్రవృత్తి యిలాగే విజృంభిస్తుంది. జ్వరం తగ్గిన వెంటనే పత్యంబదులు పిండివంటలతో భోజనం చేసినా- మహారాజుదగ్గర ఆయుధాలన్నీ లాక్కుని-సంకటి జావా, తుంగ చాపా యిచ్చినా ఆ మనుష్యుల్లో కూడా యింతే ప్రళయం రేగుతుంది."

"అయితే అతను అవసరం కోసం దొంగలించడంలేదుగా" అన్నాడు రఘురాం

''లేదనుకో- ఆలోచిస్తే- అతన్ది 'గ్లామర్ తెఫ్టింగ్' అనాల్సివస్తుంది. దానివల్ల లభించేది మానసికానందం తప్ప బాహ్యానందం లేదనే చెప్పుకోవాలి. వేళకి భోజనంచెయ్యడం యెంత అవసరమో - శరీరంలోపల జరిగే - అంతర్గతంగా పుట్టే అలజడిని ఆపు చేసుకోవడానికి కూడా మనిషి అంతే స్ట్రగుల్ అవుతాడు.....అవసరం లేకపోయినా యెదటిమనిషి అవసరాన్ని దొంగిలించి - అతనికి చిరాకు కల్గించి-

ఆ చిర్ాకుతో తను మౌనరాగాలు వింటాడు....''

"అయితే యీ జాడ్యానికి మందేమిటి....యిలాంటివాళ్ళు యెక్కడ ఆగుతారు. ఆఖరికి వీళ్ళందరూ దేశానికి 'ఐక్ మెన్స్'లా తయారవరంటావా అన్నయ్యా" అన్నాడు రఘురాం భయంగా.

''చూద్దాం'' అన్నాడు గోపాలం.

* * *

సుఖస్వప్నాలు కంటున్న ఆశాజీవి వదనంలావుంది పెళ్ళివారిల్లు. అలికి ముగ్గులుపెట్టిన వాకిళ్ళలా వున్నాయి పెళ్ళివారి మనసులు. ఆడవాళ్ళు — అటూ యిటూ తిరగడం చూస్తూంటే యింద్ర ధనస్సులు ప్రాణం పోసుకున్నట్టుగా వుంది. అక్కడక్కడ వెలుగుతున్న గాస్ లైట్ మేంటిల్స్ మంచుగడ్డ కట్టినట్టుగా కన్పిస్తున్నాయి. దానిచుట్టూ పురుగుల్లా మగవాళ్ళు వూగిసలాడుతూ చీట్లాటలో మునిగివున్నారు.

చీరలు కట్టేల్తున్న చప్పుళ్ళు - వుండుండి సెంటు గుభాళింపు - దూరంగా గదుల్లోంచి పల్చబడి విన్పించే నవ్వు - రహస్యంలా మారి వినబడే మాటలు - చంటిపిల్లల మారాములూ — చూస్తూంటే వివాహం తంతుకూడా వోరకమయిన యుద్ధమే అన్పిస్తుంది. ఈ యుద్ధంలో సంఘర్షణలన్నీ ముఖస్తుతిలోకి జారి - కథలన్నీ ఆప్యాయతగామారి - అనురాగంలోకి ప్రవహిస్తూ, ఆఖరికి యిద్దరు మనుష్యుల్ని కలిపి - తాము వుక్కిరిబిక్కిరయి, తదాత్మ్యం పొంది తుదిగా యెవరికివాళ్ళు విశ్రాంతికోసం అన్నట్టు తమ శిబిరాల్లోకి వెళ్ళిపోవడం జరుగుతుంది. ఆనందంకోసం, ఆప్యాయతకోసం కూడా మనుష్యులు శాంతి యుద్ధాలు వాంఛిస్తారని - పెళ్ళిళ్ళకి వచ్చి తృళ్ళిపడే మనుష్యుల్ని చూస్తే నిజం అన్పిస్తుంది.

అయితే యీ శాంతి యుద్ధానికి ఆయుధాలు లేకపోయినా - యుద్ధమే కనుక - గాయాల్లాంటి, అలకలు — ఓటమిలాంటి సరదా యెత్తిపొడుపులు వోకరికొకరు కల్గించుకుంటూనే వుంటారు.

భగవాన్లు అంతరాత్రి హడావిడిగా లోపలినుంచి వాకిట్లోకి వచ్చి ''అమ్మా-యిదేదే'' అన్నాడు.

''సీతమ్మగారితో చెప్పివస్తానని వెళ్ళింది-ఇంతకీ యేమిటీ కంగారు'' అంది రామమ్మగారు.

యింతలో విశాలాక్షమ్మగారు కంగారుగా లోపలినుంచి ''పెట్టెలో డబ్బు కన్పించటం లేదండీ'' అంది.

''అయ్యో — అయ్యో''

''సరిగ్గా చూడు — యెక్కడ పెట్టావో. తాళం సరిగ్గా చూసుకో

మని పోరుతూవే వున్నాను." అంది అత్తగారు.

"ఇప్పుడే తాళం తీసి అలా వెళ్ళానంతే"...

అందరూ చేరారు - "యెలా పోయింది?" "యెంత?" "యెప్పుడండీ?" "ఆశ్చర్యం!" "ఘోరకలి!" లాంటి పదజాలాన్ని వదుల్తూ.

రామమ్మగారు అంతమందికీ యేడుస్తూనే సమాధానం చెప్పింది. గోపాలం వచ్చాడు.

"చూడుబాబూ – అంత దూరం నుంచి మీ యింట్లో పెళ్ళికదా అని వచ్చాం. మా డబ్బే పోవాలా?" అనేసింది.

యింతలో రుక్మిణి వచ్చింది....

"యెలా" అన్నాడు భగవాన్లు,

ఆ పెళ్ళికి పెద్దలు గోపాలం రుక్మిణీ కావడం మూలంగా అందరూ వాళ్ళ నిర్ణయంకోసం అన్నట్టు చూస్తున్నారు.

"సరిగ్గా మరోసారి చూడు మామయ్యా" అన్నాడు గోపాలం.

యింతలో హడావిడిగా రఘురాం - అవతలి గదిలోంచి శివరావు రావడం ఒకేసారి జరిగింది.

"పిళ్ళడబ్బు పోయిందిట - వంద రూపాయలు" అన్నాడు – గోపాలం భార్యవైపుచూస్తూ, రుక్మిణీ ఆ భావానికి తట్టుకోలేక నేల చూసింది.

"రైలుస్టేషన్ నయం-పెళ్ళివారింటికన్నా సేఫ్టీ" అన్నాడో బంధువు.

"మా డబ్బు తిన్నవాడు మట్టి కొట్టుకు పోతాడు."

శివరావు అందరివైపూ చూసి-మౌనంగా అక్కడినుంచి వెళ్ళి పోయాడు.

"అతను నీ బావమరిది కదూ" అన్నాడు భగవాన్లు.

"అవును-అతని పేరు శివరావు" అన్నారు మరొకరు.

"మరోసారి పెట్టంతా వెదకండి-రండి" అంది రుక్మిణి.

"నీపిచ్చిగాని దొరుకుతుందంటావా అమ్మా - అదప్పుడే యెన్ని చేతులు మారిపోయిందో."

రుక్మిణీ, విశాలాక్ష్మమ్మగారూ లోపలికి వెళ్ళారు. రఘురాం, గోపాలం మాట్లాడుకోలేక వొకరి నొకరు చూసుకున్నారు.

ఆ దొంగతనం గురించే అందరూ వింతగా చెప్పుకుంటున్నారు.

సీతమ్మగారు కోడలు రావడం చూసి "దొరకలేదా" అంది.

"లేదు" అంది ఆవిడ వస్తూనే. యింతలో శివరావు వచ్చి "చూడండి పిన్నిగారూ, మీరు అలా వసారాలోకి వెళ్లేరు కదూ" అన్నాడు.



"ఈయన ప్రముఖ ముఖచిత్రకారుడు..."
"ఓ...చెప్పకుండానే తెలుస్తూనే ఉందిగా..."

"అవునాయనా, ప్రారబ్ధంకొద్దీ వెళ్ళేను."

"మరక్కడ పారేసుకుని పెట్టంతా వెదికితే యెలా దొరుకుతుందండీ - యిదిగో అక్కడ పడివుంది" అన్నాడు వందరూపాయల కాగితం అవిడ కిస్తూ.

"యేది, యేది" అంటూ నలుగురూ చుట్టుముట్టారు.

"మంచివాడు కాబట్టి సరిపోయింది, యిచ్చాడు" అంది రామమ్మగారు.

"తీసింది వొకడే అయినా - అనుమానం అందరిమీదా తగుల్తుంది-దొరికింది కాబట్టి బ్రతికిపోయాం."

"మా యింట్లో పెళ్ళికొచ్చి పోగొట్టుకున్నా రన్నమాట తప్పింది-పోనీలెండి" అంది రుక్మిణి అప్పుడే వచ్చి నెమ్మదిగా.

"అదేమి టమ్మా - దొరక్కపోతే యేం చేస్తాం."

శివరావు అప్పటికే లోపలికి వెళ్ళిపోయాడు.

క్షణాల తర్వాత చూసుకుంటే రఘురాంకు - గోపాలానికి వొకరి కొకరు కన్పించారు.

*　　　*　　　*

బావా —

నాకు తెలుసు. అసలు నేను మీ యింటిలో పెళ్ళికి రాకూడదనుకున్నాను. యెందుకొచ్చానో నాకా రోజు తెలియలేదు. వచ్చి వెళ్ళిన

తరువాత మాత్రం రావడం మంచిదే అన్పించింది. నాగురించి చెల్లాయి రుక్మిణి చెప్పలేక దాచినా, చాలా మంది దాచుకోలేక నీతో చెప్పి వుంటారు. నన్నేం చెయ్యమంటావు. శరీరంతోపాటు అవయవాలు ఎదుగుతాయి. అలాగే అనుభవాలూ— అలవాట్లూ బలపడి వాటిచుట్టూ కండలు పెంచుకుని మనుష్యుల్నే జయిస్తాయని అన్పిస్తోంది.

చిన్నప్పుడు నాగురించి పట్టించుకువేవాళ్ళు లేరు. నాన్నంటే నాకు భయం. ఆయనకూ నాసంగతి పట్టేది కాదు. యిక అమ్మ చూసీ చూడనట్టు వూరుకునేది. మరోసారి కాఫీ తాగడం కోసం, సిగరెట్లు కాల్చడం కోసం దొంగతనం చేసేవాణ్ణి. జేబులో డబ్బులువున్నా - యెక్కడైనా డబ్బులుకన్పిస్తే స్వంతం చేసుకోవాలనిపించేది.

ప్రతీ గజదొంగకి కొంతకాలం పోయేసరికి తన అవసరం మీదకన్నా- నేర్పుమీదా, పనివాటితనం మీదా మమతపుట్టి దొంగతనాలు చేస్తాట్ట. నేనూ అంతే అయ్యాను.

వోసారి సరదాగా స్నేహితుడి జేబులో యిరవై రూపాయలు స్వంతం చేసుకున్నాను. ఆ తరువాత అతనే మమ్మల్ని ఆప్తమిత్రులనుకుని- పోయినడబ్బు గురించి కన్నీరు పెట్టుకుంటే మాకేం బాధకల్గలేదు. కారణం విన్నతరువాత మాత్రం - ఆ కన్నీరు నన్ను అలలు అలలుగా ముంచేస్తోందనిపించింది.

పదేళ్ళనాడు అప్పగార్ని వదిలేసిన బావ - భార్యని విజయవాడ వరకూ తీసుకువచ్చి దిగపెట్టమనీ అక్కడ నుంచి తనతో అంబాలా తీసుకు వెడతానని వుత్తరం వ్రాసి డబ్బు పంపించాట్ట.

ఎంతో సంతోషంతో కాపురం గురించి కలలు కంటూ ఆ ఆడదీ - అప్పగారి ఆనందాన్ని వూహించు కుంటూ తమ్ముడూ - స్టేషన్‌కు వెళ్ళి- నిరాశపడి — మరోదారిలేక వెనక్కి తిరిగివస్తే - ఆ తిరిగివచ్చిన మనిషి, తన పాలిటి రాక్షసుణ్ణి — మనిషి రూపంగా వున్న — నాతో చెప్తూంటే నాకు బ్రతకడానికే కాదు చనిపోవడానికి కూడా అర్హత లేదనిపించింది.

నేనెప్పుడూ వొకరి చిరాకులో, కోపంలో ఆనందం చూసేవాణ్ణితప్ప కన్నీటివిలువ యెరుగను. చిన్నప్పుడే అమ్మా నాన్నా నన్ను తిట్టి—నాగురించి కన్నీరు కారుస్తోన్నట్టు తెలిస్తే — నేనిలా మారేవాణ్ణి కాదేమో.

ఆ రోజునుంచీ నాకు తెలియకుండా కలల్లో ఆస్త్రీమూర్తి కన్పించేది. ఆరు నెలలు అదే వూహాలో భయంకరంగా నలిగిపోయాను. ఆ తరువాతే మీ



యింట్లో పెళ్ళికి వచ్చాను సమయం చూసి నీముందు నా తప్పులు ఒప్పుకోవా లనుకున్నాను జరిగింది వేరు నేను మీ మొహం తిరిగి యెలా చూడగలను

ఆ డబ్బు నేను దొంగిలించలేదంటే భగవంతుడుకూడా నమ్మడానికి వెనకాడతాడు నువ్వు నమ్మగలవా తిరిగి నిన్ను కలుసుకోవడం జరిగితే అన్నీ చెప్పగలిగిన స్థితికి యెదిగితే—నీ ముందు నా జీవితంగురించి వప్ప చెప్పుతాను

—శివరావు

ఆఫీసులో వుత్తరం పూర్తిచేసి గోపాలం అచేతనంగావుండిపోయాడు. ఫ్యూన్ వచ్చి కాఫీ యిచ్చి వెళ్ళాడు. లీజర్ టైమ్ మూలంగా ఆఫీసంతా నిశ్శబ్దంగా వుంది. అత నొక్కడే బయటకు వెళ్ళింది. యింతలో ఫ్యూన్ వీరాస్వామితో రఘురాం, భగవాన్లూ లోపలికి వచ్చారు.

"రండి భగవాన్లుగారూ - రా రఘూ."

"యేవోయ్ అల్లుడూ కులాసా."

"యిదిగో యిదే కులాసా" అన్నాడు నవ్వుతూ గోపాలం.

"అన్నయ్యా - యీాయన నీతో గమ్మత్తయిన విషయం చెప్పడానికి వచ్చారు."

"యేమిటి?"

"చూడు - ఆరోజు మీ యింట్లో పెళ్ళినాడు వందరూపాయలు పోయి-దొరకాయి గుర్తుందికదూ. మీ బావ మరిదికి గాడిపొయ్యిదగ్గర దొరికింది నోటు."

"అవును."

"తీరా యింటికి వెళ్ళి మా ఆవిడ చూసుకుంటే మరో వందరూపాయల కాగితం పసుపుబట్టలో కన్పించింది. అప్పగింతల హడావిడిలో అందులో పెట్టిందిట."

"ఆ...."

"తరువాత గుర్తుచేసుకుంది ... యింతకీ అతనికి దొరికిందని యెలా యిచ్చాడంటావ్ ."

రఘురాం అప్పటికే ఆ విషయం విన్న మూలంగా అర్థం అయినట్టు చూస్తున్నా - గోపాలం తికమకగానే వున్నాడు.

రఘురాం అన్నాడు "అది యెవరిదో అయివుంటుంది" అని.

అలా రఘురాం చెప్పినా గోపాలానికి సమస్య అంతుపట్టలేదు. రఘురాం చెప్పడం మొదలుపెట్టాడు. గోపాలం బాధగా చూశాడు.

సాయంకాలం యింటికి వెళ్ళి కుర్చీలో కూర్చునేసరికి రుక్మిణి కాఫీ తీసుకువచ్చి టేబిల్ మీద పెట్టింది.

"రుక్మిణీ అలా కూర్చో."

"యేం?"

"మీ అన్నయ్య వుత్తరం వ్రాశాడు" అని వుత్తరం అందించాడు.

రుక్మిణి వుత్తరం పూర్తిచేసి కదలికలు పోగొట్టుకున్నట్టయిపోయింది.

"మీ అన్నయ్య మారేడంటావా?"

"నే నేం చెప్పగల్ను" అంది... సాదాగా.

"మన యింట్లో పెళ్ళిలో.. " అని మొదలుపెట్టి అంతా గుర్తుచేసి - భగవాన్లు యిచ్చిన వందరూపాయలు చూపిస్తూ —

''అయితే రుక్మిణీ - మీ అన్నయ్య యెందుకు తన స్వంత డబ్బు యిచ్చాడంటావు. పాపం తనని అనుమానించారని అలా చేసివుంటాడు .... నిజం. అందరూ యేమిటి. నేనూ అతనే తీసి వుంటాడనుకున్నాను. యివ్వకపోతే పక్కకు పిల్చి చివాట్లు వెయ్యాలనుకున్నానుకూడా.''

రుక్మిణి వింటోన్నట్టు చూస్తోంది.

''మీ అన్నయ్య మారినందుకు యింకో స్థితిలో అయితే ఆనందించేవాణ్ణి. కానీ-అతనికి మనపట్ల యెంత భయం యేర్పడితే అలా చెయ్యాని నేరానికి తలొగ్గుతాడంటావు. ఆలోచిస్తే మనం అసభ్యంగా వూహించినందుకు సిగ్గుపడాల్సి వస్తోంది'' అన్నాడు తలపట్టుకుని.

''అవును. మీరేకాదు అందరూ.'' తొందరగా లేచి లోపలికి వెళ్ళిపోయింది రుక్మిణి. వుత్తరం చేతిలో నలిగిపోతూంటే, కన్నీటితో తడుస్తూంటే అనుకుంది.

''అన్నయ్యా; అంతాకాదు, నేను నిన్ను అనుమానించాను. చెయ్యాని నేరం నీకు అంటగట్టి...నిన్ను తిట్టి....

గోపాలం రుక్మిణి కన్నీరు పెట్టుకోవడంచూసి..''యేమిటది రుక్మిణీ-యేడుస్తున్నావా - ఛా ఛా.... మీ అన్నయ్యమీద నాకేం అనుమానంలేదు సరా....వూరుకో....'' అనేశాడు. బాధగానే

''లేదండీ...అందరిలా అన్నయ్యను నేనూ అనుమానించాను. లేకపోతే వాడ్నితిట్టి-నేనే ఆ వందరూపాయలు వాడిచేత ఆవిడకు యిప్పించి వుండకపోదును ... యెంత బాధపడి వుంటాడో.''

బావురుమనేసింది రుక్మిణి.

గోపాలం క్షణం నిరుత్తరుడయ్యాడు. రుక్మిణి అతని కౌగిల్లో కన్నీటికళిక అయ్యింది. సాయంకాలం రఘురాం అన్నమాటలు గుర్తొచ్చాయి గోపాలానికి. వెంటనే -

''అతని వూహామూలంగా నువ్వు నిందమోయాల్సి వస్తుందనుకున్నావు. కాని నీగురించే అతను చెయ్యాని నేరానికి నిందలు భరించాడు...''



# జీపు ప్రమాదం

పరిమితమైన మన జీవితకాలంలో అపరిమితమైన వ్యక్తిత్వాలెన్నో తటస్థ పడుతుంటాయి. అందులో కొన్ని వ్యక్తిత్వాలు మన స్మృతి పథంలో అప్పుడప్పుడూ రూపులు దిద్దుకుంటుంటాయి. కాని ఆశ్చర్య మేమిటంటే పరిచయం లేదుకదా చివరకు ఆకారం అయినా చూడని ఓ వ్యక్తిత్వం మాత్రం నాలో యిప్పటికి నిలిచి వుందంటే అది ఆ వ్యక్తిలోని విశేష మనే చెప్పాలి. ఉత్సాహం కొద్దీ అంతకుక్రితం అడిగా నన్న విషయం కూడ మరచిపోయి రాజశేఖరం గారిని అడుగుతుంటాను "ఆవ్యక్తిది ఓ ఫొటో వుందా?" అని. "లేదు, చంద్రంగారూ!....కాని ఫొటో వున్నంతమాత్రాన మీరేం తెలుసుకుంటారు ? మామధ్యలో కొన్ని రోజులు మెలిగినా ఆ వ్యక్తిని గూర్చి మేము పూర్తిగా తెలుసుకోలేక పోయాం" అని జవాబిచ్చేవాడు.

రాజశేఖరంగారూ, నేనూ అపరిచితులం. కాని ఓ సమయంలో కలుసుకోవటం జరిగింది. ప్రభుత్వ భూగర్భ శాస్త్ర పరిశోధకులు ఆ ప్రాంతంలో బొగ్గు దొరుకుతుందని అంచనా వేశారు. గనుల త్రవ్వకాలు ప్రారంభ మయ్యాయి. ఆ ప్రదేశంనుండి దగ్గర్లో వున్న రైలుస్టేషనుకు రహదారి వేశారు...ఆరోజు నాకు బాగా జ్ఞాపకం వుంది. క్రొత్త రహదారిపై గూడ్సు బండికి ప్రారంభోత్సవం చేసేందుకు ప్రధానమంత్రి అక్కడికి వచ్చారు. ఆ సందర్భంలోనే హైద్రాబాద్‌లో ప్రెస్ రిపోర్టర్‌గా వున్ననేను అక్కడకి వెళ్ళటం జరిగింది. న్యూస్ పేపరుకు సమాచార మంతా పంపిన తర్వాత అక్కడి పనులకంతా ఇన్‌చార్జ్ ఇంజనీరుగా వున్న రాజశేఖరంగారు వచ్చి నన్ను కలిశారు.

"అయితే యిప్పటికి మీకు తీరిక కలిగిందన్నమాట. ఇద్దరం కలిసి అలా వెళ్ళివద్దాం పదండి, జీపు వుంది" అని అడిగారు రాజశేఖరంగారు.

ఆ అరణ్యంలో ఈ ఆలోచన నాలో ఉత్సాహాన్ని కలిగించింది. అతడు వుంటున్న క్వార్టర్సు 15 మైళ్ళ దూరంలో వున్నాయి ఇద్దరం జీపులో

ఇంగ్లీషు అనువాదం :
శ్రీ భవాని భట్టాచార్య

తెనుగు అనుసరణ :
రాళ్ళపల్లి సదాశివశర్మ

కూర్చుని బయలుదేరాం. కొంత దూరం వెళ్ళాక, "అదో! ఆ కొండ ప్రక్కనున్న గుడారంలోనే మే ముండే" దంటూ వ్రేలుతో చూపించాడు రాజశేఖరం. "ఇదంతా నా ల్గవ సెక్షన్ పరియా. నాక్రింద మొత్తం పదిసెక్షన్ లున్నాయి. ఇద్దరు అసిస్టెంట్ ఇంజనీర్ల సహాయంతో ఈ ప్రాంతంలో నలభై మైళ్ళ రహదారి వేశాం. ఈ రెండేళ్ళలో కొన్ని కోట్ల ఘనపుటడుగుల మట్టిని తీశాం" అంటూ చెప్పుక పోతున్నాడు.

ఈ విషయా లన్నీ చెబుతుంటే బయలుదేరినప్పటి నాలో ఉత్సాహం సన్నగిల నారంభించింది. ఇక వుండ లేక, "రాజశేఖరంగారూ! ఇంకేమైనా విషయాలు చెప్పరాదా? ఇక్కడ శ్రమిస్తున్న మనుష్యులగూర్చి ఏమైనా చెప్పండి" అని అడిగాను.

"చెప్పేందు కేమున్నాయండీ! పని చేస్తున్న కూలివాళ్ళను పులులు లాక్కెళ్ళాయి లాంటి విషయాలు చెబుదామంటే యింతదాకా అసలు పులి యెలా వుంటుందో చూడలేదు... ఒక్క సంఘటనమాత్రం జరిగింది. కాని ఇక్కడి పనులకూ, దానికి సంబంధం లేదనుకోండి."

"ఏం జరిగింది?" అని ఒక్కసారి ఆతృతగా అడిగాను.

రాజశేఖరంగారు ఏదో ఆలోచనలో పడ్డారు. తనలో తా నేదో గొణిగి నట్లుగా అనుకోవటం నాకు విన బడింది. "ఉద్యోగ విషయంలో చురుకుగా వున్న ఆ వ్యక్తి యింకా ముందు ముందు మంచి అభివృద్ధిలోకి రావలసి వుంది...." అంటూ ఒక్కసారి మౌనం దాల్చాడు.



ఇంతలో రాజశేఖరంగారు వుంటున్న గుడారాల దగ్గరికి చేరాం.

"రండి! మా బకింగ్‌హాం ప్యాలెస్ లోకి" అంటూ ఆహ్వానించి కాఫీ చేసే ప్రయత్నంలో నిమగ్నుడయ్యాడు. కాని జీపులో ప్రారంభమైన మా మాటలగాలి అతడి మనోవీధిలో మెదులుతూనే వుంది.

"మీ రచయితలతో వచ్చిన చిక్కేయిది. కథల్లో నింపేందుకు మీకు మనుష్యుల విలువ తేలే కావాలి. అయినా ఒక టదుగుతాను చెప్పండి. స్త్రీ వ్యక్తిత్వానికి వున్న విలువల్లో ఆమె శీలానికి ఎలాంటి ప్రాధాన్యమిస్తారు?" అంటూ ఆకస్మికంగా ఓ ప్రశ్న విసిరాడు రాజశేఖరం.

జవాబుకై కాసేపు తడబడ్డాను. "అది ఒక్కొక్కరిలో జీర్ణించుకపోయిన అభిప్రాయాలపై ఆధారపడి వుంటుంది...అంతేకదండీ!" అన్నాను.

"అది నిజమేననుకోండి. పూర్వాచార పరాయణుడనైన నాలాంటివాడుకూడా ఈ విషయంలో తప్పు అభిప్రాయ పడ్డాడేమోనని ఒక్కొక్కసారి అనిపిస్తుంది." అంటూ ఇంతలో నా వైపు తిరిగి, "మీ రా కుర్చీలో ఎంతసేపు అలా కూర్చుంటారు. ఆ క్యాంపుకాట్‌పై నడుం వాల్చండి. ఇంతకూ మీరు త్వరగా వెళ్ళవలసిన అవసరమైతే లేదుగా" అన్నాడు.

"అవసరమైతే లేదనుకోండి – ఒకవేళ మీ రా కథ చెబుతానంటే" అంటూ క్యాంపుకాట్‌పై విశ్రమించాను.

ఒక్కసారి మళ్ళీ ఏదో ఆలోచనలో పడిపోయాడు రాజశేఖరం. కొన్ని నిముషాలు గడిచాక పెదవి కదల్చాడు. "ఒక్కొక్క పర్యాయం ఈ సంఘటనలో నావల్ల జరిగిన తప్పును నేను వప్పుకుంటే నా గుండెలమీదున్న ఆ బండల బరువుకాస్త తొలగిపోతుందనుకుంటాను. నిజంగా ఆ ఘోరానికి నేనే బాధ్యుణ్ణేమోనని క్రుంగిపోతాను. అంతవరకూ ఆ యువకుడు తన భార్యను యిక్కడికి పిలుచుక రావాలన్న ప్రసక్తే తేలేదు. ఆమెను పిలిపించమని నేనే సలహా యిచ్చాను."

"అతడెవరు?"

రాజశేఖరం మనోఫలకంపై తిరిగి ఒక్కసారి గత గాథ కదలసాగింది.

"అతడి పేరు రవీంద్ర. ఇక్కడ అసిస్టెంట్ ఇంజనీరుగా ఆ మధ్యే వచ్చాడు. కాలేజీ చదువు ముగించుకొని మంచి భవిష్యత్తు గల ఈ ఆల్ ఇండియా సర్వీసులో ప్రవేశించాడు. మా మధ్య స్నేహం బాగా వృద్ధిపొందింది. ఒకరోజు అతడి గుడారంలో టేబిల్‌పై ఓ దంపతుల ఫోటో కనిపించింది. అందులో వున్నది రవీంద్ర. అప్పుడే విషయం తెలిసింది. ఈ ఉద్యో

గంలో చేరే ఒక వారంరోజుల క్రిందటే అతడి వివాహం జరిగింది.

''ఆరోజే అతడికి సలహాయిచ్చాను. అమితంగా ప్రేమిస్తూన్న భార్యా వియోగం ఎంత బాధాకరమో నాకు తెలుసు. ఈ ప్రాంతాలకు రాకముందే నా భార్య పోవటం జరిగింది. కొన్ని నియమాలకు కట్టుబడి నేను మళ్ళీ వివాహం చేసుకోలేదు.

'' 'రవీంద్రగారూ ! పెళ్ళైన తర్వాత ఎంతోమంది హనీమూన్ అంటూ దూరప్రాంతాలకు, సుందర ప్రదేశాలకు పోవటం జరుగుతుంది. ఇక్కడి వాతావరణం చాల హాయిగా వుంటుంది. ఇంకొక అసిస్టెంట్ ఇంజనీరుగారూ, యితర క్లర్కులూ తమ కుటుంబాలతో వుంటున్నారు. ఒంటరితనం అన్నది లేదు. మీ శ్రీమతినికూడ పిలిపించండి' అని చెప్పాను. తమకు సంతోషం లేనివాళ్ళు యితరులను సంతోషపెట్టి ఐనా తృప్తిపడాలి చంద్రంగారూ! సంతృప్తి అనేది జీవిత కుసుమానికి మధువు — అది లేకపోతే కాగితంపూవు. కాని తరువాతి విషాదం ఒక్కసారైనా చూచాయగా మెదిలి వుండివుంటే ఆ సలహా యిచ్చేవాణ్ణి కానేమో! అతడు కాస్త సిగ్గుపడ్డాడు. ఇక నేనే అతడి తలిదండ్రులకు ఉత్తరం వ్రాశాను. ఒకవారంరోజుల్లో నా కృషి ఫలవంత మైంది.

" 'వీరు రాజశేఖరంగారు. మా ఇంజనీరు' అంటూ పరిచయం చేశాడు రవీంద్ర. ముకుళిత హస్తాలతో, వికసించిన చిరునవ్వు పెదాలపై తాండవమాడుతోంటే, కట్టుకున్న బెంగుళూరు సిల్కు చీరె చెరుగులు నేలపై వ్రేలాడుతూంటే ఫస్టుక్లాసు కంపార్టుమెంటులో నుండి దిగుతూ అభివందనం చేసింది కుసుమ. ఓ విధమైన ఠీవి, అమాయకత్వం ఆమె ముఖంలో దోబూచులాడుతున్నాయి.

''ముగ్గురం జీపులో పడ్డాం. రవీంద్ర డ్రైవింగ్ సీటులో కూర్చోవటం చూసి 'మీకు డ్రైవింగ్ లైసెన్సు వుందా?' అని అడిగాను.

'' 'లేదనుకోండి. ఆ లైసెన్సులూ, అవీ తీసికోవాలంటే నాకు తగనిబద్ధకము. కాని డ్రైవింగ్ లో మాత్రం డ్రైవర్లకే చెప్పగలనులెండి' అన్నాడు రవీంద్ర జీపు స్టార్టుచేస్తూ. బహుశా భార్య ప్రక్కనున్న ఉత్సాహమేమో అది!

'' 'మీకీ ప్రదేశం ఎలాగుందండీ? మీరు రచయిత్రులని విన్నాను. ఇంకేం—మీకు కావలసినంత ఆహారం' అంటూ ఆమెవైపు తిరిగాను.

'' 'ఆఁ, మీరలా అనుకుంటారుగాని—పట్నంలో వున్నంతసేపే ననుకోండి అరణ్యాలనీ, సుందర ప్రాంతాలనీ కవిత్వాలు వ్రాయటం. కాని అసలు

అరణ్యంలో ప్రవేశిస్తే అవన్నీ మరచి పోతారు' అంటూ కుసుమవైపు చూచాడు రవీంద్ర. ఆమె తల వాల్చింది. ఆ సిగ్గూ, ఆ అమాయకత్వమూ చూస్తే ఎవరూ ఆమె M. A. లిటరేచర్ అనిమాత్రం ఊహించరు. ఇప్పుడిప్పుడే జీవిత ప్రాంగణంలో అడుగు బెడుతూన్న ఈ మైనపుబొమ్మ గుడారంలో భర్త లేనప్పుడు ఎలా వుంటుందా యని ఆశ్చర్యపడ్డాను.

"మరురోజు సాయంత్రం అతడి గుడారం దగ్గరికి వెళ్ళేసరికి వాళ్లిద్దరూ బయటికి వెళ్ళా రని తెలిసింది. ఇక నేనూ అలా బయలు దేరాను. జీవితంలో ఇంకా మలుపులు చూడని వాళ్ళిద్దరూ ఓ రోడ్డుమలుపులో కనిపించారు. ఏదో చిరాకుగా వున్నా డని అతడి ధోరణే చెబుతూంది. ఎవరిమీదో కేక లేస్తున్నా డని నాకు అంతదూరం నుండే వినిపించింది.

"'పోనీలెండి. మన మెళ్దాం పదండి' అది కుసుమధ్వని. కాని రవీంద్ర మాత్రం వదిలేట్టుగా కనబడలేదు.

"'నీ వసలు ఎక్కడుండటం? ఇంకోసారి ఈ ప్రాంతాల్లో నాకు కనిపిస్తే పోలీసుల కప్పగిస్తాను జాగ్రత్త' అంటున్నాడు రవీంద్ర.

ముగ్గురం కలిసి రవీంద్ర గుడారం చేరాం. 'ఎవ రది?' అన్నాను.

"'ఎవరుంటారులెండి.....అదే....ఆ ఉద్యోగం లేని వెధవ, ఆ డ్రైవరున్నాడే....కరీం. ఉద్యోగ మిప్పించమంటూ రోజూ నన్ను పీక్కుతింటున్నాడు. మొట్టమొదట అడిగినప్పుడే వాడికైసెన్సు చూశాను. దురుసుగా కారు నడిపి ఇద్దర్ని పొట్టబెట్టుకొని జైలుకు వెళ్ళాడు. మళ్ళీ యిప్పుడు మొదలు పెట్టాడు....ఈ వెధవలకు ఏకాంత మన్నా లేదు, పాడూ లేదు. ఈవిధంగా జరగటం యిది నాల్గోసారి' అన్నాడు రవీంద్ర.

"కరీం అంతక్రితం నాదగ్గరకి వచ్చేవాడు. ఆ లోతుకుపోయిన కళ్ళూ, పీక్కుపోయిన ముఖం; మురికిగుడ్డలు.. అన్నీ ఒక్కసారి మెదిలాయి. చరిత్రహీనురా లైన తల్లిమాత్రం వుంది. అదే వాడి జీవితచరిత్ర.

"రాగానే ఒకటిరెండు రోజులు రెస్టుకూడా తీసుకోకుండా ప్రదేశాలను చూడటం అప్పుడే మొదలెట్టా రన్న మాట. 'ఈ రోజు ఏ వైపు వెళ్ళారు?' అంటూ ప్రసంగం మార్చాను.

"రవీంద్ర హుషారుగా అంతా చెప్పుకపోతున్నాడు. ఆ ఎత్తైన కొండలు, లోతైన లోయలు, మంచు నీటితో మెరసిపోతోన్న పచ్చిక బయళ్ళు — అవన్నీ చూచి కుసుమ ఎంతగా సంతోషించిందో, అంతకంటే మురిసిపోయాడు. ఆ సంతోషంలో, చివరికి ఆ బయళ్ళలో నడుస్తున్నపుడు



"ఏవండీ ! మునసుబుగారి ఇల్లెక్కడండీ ?"
"ఈ రోజు పేపర్లో పడలే దబ్బాయ్."

ఆమె సాండల్స్ తన చేతుల్లో వున్నాయన్న విషయంకూడా చెబుతూ నాలుక కొఱుక్కున్నాడు. కుసుమ అవనతముఖి యైంది.

"ఇందులో సిగ్గుపడాల్సిన విషయమేముంది రవీంద్రగారూ! అవన్నీ పాతకథలు. ఎన్నటికీ చెరగిపోని సహజీవనసూత్రాలు అన్నాను.

"అప్పుడప్పుడే కొండలచాటున అస్తమించబోతూన్న రవితేజాన్ని చూచి, "అయ్యో! అక్కడేవో యిళ్ళు తగలబడిపోతున్నా"యంటూ కేక పెట్టిందట కుసుమ.

" 'ఆ ఎత్తైన కొండలు మనకు 20 మైళ్ళ దూరంలోనే వున్నాయి. ఒకరోజు మన జీప్‌లో అటూ వెళ్ళివద్దాం లెండి. సరే! చీకటిపడుతోంది గుడ్ నైట్' అంటూ శెలవు తీసుకున్నాను.

"చంద్రంగారూ! వారి దాంపత్య రాగవీణపై ఎప్పుడూ అపశృతులు పలకగూడదనీ, అనురాగామృతంతో నిండి తొణికిసలాడే వారి జీవిత కలశంలో ఒక్క విషపు బిందువుగూడా చిలకగూడదనీ, వారి ఆనందచంద్రుని ఏ విషాదమేఘాలు కమ్మగూడదనీ హృదయపూర్వకంగా ఆశించిన

వాళ్ళలో నేనొకణ్ణి. కాని అప్పుడు తెలిసింది రోడ్డుమీద ఎత్తు పల్లాల్లాంటి సుఖదుఃఖాల సమపాళ్ళ కలయికే జీవిత మని. ఏ కాలంలో, ఏ సంఘటనతో జీవితం ఎలాంటి మలుపు తిరుగుతుందో చెప్పడం కష్టం. చెప్పరాని పరిస్థితులూ, కలిసిరాని కాలం ఎన్నో ప్రమాదాలనూ, అశాంతినీ కలిగిస్తూంటాయి. ఆ రోజు ఆమెను పిలిపించమని చెప్పింది నేనే. మళ్ళీ మరురోజు ఆ కొండల దగ్గరికి వెళ్దామన్న ఆలోచనా, ఉత్సాహం కల్గించిందీ నేనే. అందుకే ఆ పశ్చాత్తాప అగ్నిమాత్రం నా హృదయాన్ని ఎప్పుడూ దహిస్తూనే వుంటుంది. ఆ ఆలోచనే రాకపోతే అవన్నీ జరిగేవి కావు.

"ఒక రోజు మధ్యాహ్నమే రవీంద్ర ఆఫీసునుండి వెళ్ళిపోయాడు. మళ్ళీ తిరిగి భోజనం చేసి రాలేనేమో నని నాతో చెప్పాడు. 'సరే, వెళ్ళన్నాను. చాల సంతోషంగా, ఉత్సాహంగా కన్పించాడు. ఆ మధ్యాహ్నం ఏం చెయ్యదలచుకున్నాడో నాతోకూడ చెప్పలేదు. కాని ఒంటరిగా, భార్యతో డ్రైవరు లేకుండా జీపులో ఆ కొండ ప్రాంతాలకు వెళ్తాడని నేనూహించ లేకపోయాను. ఆ విషయం స్పష్టంగా తెలిసిపోయింది. క్రొత్తగా జీవన బంధంలో బంధితులైన వారిరువురి మధ్య నేనెందుకులే అనుకొని చిరునవ్వుతో తృప్తిపడ్డాను. అయినా ఈ అరణ్యంలో ఏ పోలీసువాళ్ళు వచ్చి అతని లైసెన్సు చెక్ చేసే దుండ దనుకున్నాను.

"ఆ విధంగా ఆ రోజంతా హాయిగా గడిపారు.నిష్కల్మష హృదయాలతో, నిండుప్రేమతో కలుసుకున్న వ్యక్తులు వివాహజీవితంలో తొలిరోజుల అమృతాన్ని ఆస్వాదించారు. కాని అనుకోకుండా సాయంత్రానికల్లా కారుమేఘాలు కమ్మాయి. కుండపోతగా వర్షం కురిసింది. క్యాంపులో వాళ్ళ కోసం నిరీక్షిస్తూ కూర్చున్నాను. ఇంతలో ఒక ప్యూన్ చేతిలో లాంతర్‌తో గాబరాగా నాదగ్గరికి వచ్చాడు. దగ్గర్లో వున్న పోలీసు స్టేషన్‌కు ఆవిషయం తెలియజేసే ముందు నాతో ఆ విషాదసంఘటన చెప్పాడు. జీపు ప్రమాదం జరిగిందట. ఆ! ప్రమాదంలో రోడ్డు ప్రక్కగా నున్న గుడిశెలోని ఓ స్త్రీ, పురుషుడూ మరణించారట, ఆ జీపు రవీంద్రదే నని నిర్ణయించుకోవడంలో నాకాట్టే ఆలస్యం కాలేదు. రవీంద్రకు కూడా బాగా దెబ్బలు తగిలాయి.

" 'అతడి భార్య ఎలాగుంది?'' అని అడిగాను.

" 'ఆమె కేమీ గాయాలు తగల్లేదు' అని చెప్పి వెళ్ళిపోయాడు. అప్పటికి వర్షం కాస్త తగ్గుముఖం పట్టింది.

హడావిడిగా నాజీపులో బయల్దేరాను. ఇక పోలీసులు వచ్చి రవీంద్రను అరెస్టు చేస్తారన్న దాంట్లో ఎలాంటి అనుమానం లేదు. అందులోనూ రవీంద్రకు డ్రైవింగ్ లైసెన్సులేదు. పైగా అది ఆఫీసుజీపు. రవీంద్రకుజైలు ఖాయం. ఆ విషయాన్నూహిస్తేనే నా హృదయం కంపించిపోయింది. ఒకరోజు ఈ రైల్వేలో చీఫ్ ఇంజనీర్ కావలసిన జీవితం రవీంద్ర ముందున్నది. అతడు ఉద్యోగంలో కన్న కలలన్నీ రూపు దిద్దుకుంటాయి...మరి ఏమిటీ విపరీత సంఘటన! చంద్రం గారూ!మనం మంచిమనుసు కల్గివున్నా రోజులెప్పుడూ మంచివికావు. చెడుకు ఎంతదూరం తొలగిపోతున్నా ఒక్కొక్కప్పుడు పరిస్థితులు బలవత్తరంగా దానివైపే మనల్ని లాగుతాయి. జర్నలిస్టులు మీరైతే నేనిలా మాట్లాడుతున్నానేమిటని మీరాశ్చర్య పడవచ్చు. కాని ఇది కవిత్వంకాదు, చంద్రంగారూ! ఇది జీవితనగ్నసత్యం.

"వారి గుడారానికి వెళ్ళేసరికే డాక్టరు వచ్చి చికిత్సచేశాడు. ప్రాణాపాయం లేదన్నాడు. కాని గుడారంలో కుసుమ కనిపించలేదు. ఆ వర్షంలో, ఆ నిశీధిలో ఎటువెళ్ళిందో తెలియదు. ఏ నిముషంలోనైనా పోలీసులు రావచ్చు. ఆ ప్రమాదం ఎలా జరిగిందో మూడో వ్యక్తికి తెలియదు, కాని పరిస్థితు.నూహించటం ఏమంత కష్ట మనిపించలేదు. వర్షపు నీటిలో మునిగిపోయిన రోడ్డుపై జీపు నడుపుతున్నాడు రవీంద్ర. త్వరగా క్యాంపు చేరుకోవా లన్న ఆతురత. ఆ బురదలో, వంపుల్లో జీపుచక్రం కాస్తా ప్రక్కకు వరగడంతో ప్రక్కనే వున్న గుడిసెకుపోయి ఢీకొంది. గుడిశెలోవున్న ఇద్దరువ్యక్తులు మరణించారు. జరిగిందికూడా అంతే.

"కొద్దిసేపటికి కుసుమవచ్చింది. ధరించిన బట్ట లన్నీ వర్షంతో తడిసిపోయాయి. ఆ సంఘటనతో మనిషి పూర్తిగా నిర్జీవమైపోయింది. రాగానే నాచేతుల్లో వాలిపోయింది.

"ఛా! ఏమిటమ్మా? ఈ అధైర్యం! రవీంద్రకు ప్రాణభయ మేమీ లేదన్నాడుగా డాక్టరు. ఈ కష్టాలకు ఇదే మొదలు. అప్పుడే ధైర్యం కోల్పోతే ఎలా చెప్పు ?' అంటూ ఓదార్చాను

"అది నాకూ తెలుసు. వారు స్పృహ కోల్పోయేముందుకూడ అదే అన్నారు" అంటూ వాపోయింది కుసుమ.

"విషయా లన్నీ తెలుసుకుందామనుకొని ఆమెను మెల్లగా నా జీపుదాకా పిలుచుక వెళ్ళాను.

"'ఇంత సేపు ఎక్కడికి వెళ్ళారు?' అని అడిగాను.

"నమ్మటానికి వీలుగాని ఆ జవాబు వినేసరికి నాకు అమితాశ్చర్యం కలిగింది. మొట్టమొదటిసారి చూచినపుడు ఆమెలో అన్ని ఆలోచనలూ, ఊహాలూ వున్నాయని ఊహించలేక పోయాను. ఒక్కొక్కసారి యిలాంటి ప్రమాదాల్లో తప్పంతా తమమీద వేసుకొని డ్రైవర్లు తమ యజమానులను ఆదుకోవటం ఆమెకు తెలుసు. ఏదో కొంత డబ్బు ముట్టజెప్తే వాళ్లు జైలుకు వెళ్ళివస్తారు. అలాంటి వ్యక్తినే సంపాదించింది కుసుమ. వాడు మరెవ్వరో కాదు; ఇంతకుక్రితం చెప్పాను – కరీం! అయితే వాడిక ఆఫీసుకు వచ్చి తానే జీపును నడిపానని ఒప్పుకుంటాడన్నమాట. ఒక్కసారి నిట్టూర్చి ధైర్యం చెప్పి ఆఫీసుకు వెళ్ళాను. అప్పటికే కరీం వచ్చి నిలబడ్డాడు. కుర్చీలో కూర్చుని సిగరెట్టు కూడ అడిగాడు. వాడి ధైర్యానికి విస్తుపోయాను. ఉద్యోగస్థుల జాబితాలో వెనుక తేదీ వేసి అతడి పేరు చేర్చాను. సంతకం చేశాడు. నా ముందే జేబులోనుండి ఓ సీసా తీసి త్రాగడం మొదలెట్టాడు.

"ఆ విషయాల్నేమీ నేను పట్టించుకోదలచలేదు. అంతా యాంత్రికంగా జరిగిపోవాలనుకున్నాను. పోలీసులు వచ్చారు. విషయాలన్నీ సేకరించారు. కరీం ఆ త్రాగుడు మైకంలో అసలు నిజం ఎక్కడ చెబుతాడోనని నాకేమో ప్రతిక్షణం భయం కలుగుతూ వుంది.

" 'నీకింకేమైనా కావాలా?' అని మెల్లగా అడిగాను.

" 'కావలసిందంతా తీసికొన్నాను' అన్నాడు కరీం.

"డబ్బును బాగానే లాగాడన్నమాట అనుకున్నాను. అంతమందిలో ఆ విషయాలన్నీ అడిగేందుకు వీలుకాలేదు. కరీంను అరెస్టు చేసికొని పోలీసులు వెళ్ళిపోయిన తర్వాత విశ్రాంతిగా ఊపిరి పీల్చాను. బరువు కాస్తా తగ్గిపోయినట్లైంది. ఇవన్నీ చూస్తో కుసుమ ఓ వైపు నిశ్శబ్దంగా కూర్చునివుంది. ఒకరోజు మైనపుబొమ్మ అనుకొన్న ఆమెలో యింతటి బలమైన ఆలోచనలు దాగివున్నాయని నేననుకోలేదు.

" 'చాలా ధైర్యం చేశావమ్మా! ఆ వ్యక్తి సమయానికి అడ్డుపడకపోయివుంటే చాలా కష్టపడాల్సి వచ్చేది' అన్నాను.

" 'ఇక క్యాంపుకు వెళ్ళమ్మా! బాగా అలసిపోయావు. ఈ పాటికి రవీంద్రకు గూడ స్పృహ వచ్చి వుంటుంది. విశ్రాంతి తీసికో. కష్టం గడిచి మనం గట్టెక్కాం' అంటూ ప్యూన్‌ను యిచ్చి పంపాను.''

కథ కాస్త నిలిపేసరికి నేను ఫులిక్కిపడ్డాను. ఉజ్వలమైన కాంతితో నా

మనోనేత్రంముందు కుసుమ కదలుతూ వుంది. ప్రాణాపాయంనుండి తన భర్తను రక్షించుకొంది.

"ఈ కథలో యింకా చివరిదాకా రాలేదు, చంద్రంగారూ! కథంతా ముందుంది" అంటూ మొదలెట్టాడు రాజశేఖరం.

"మరురోజు క్యాంపుకు వెళ్ళేసరికి కుసుమే మొదట కన్పించింది. ఏదో ఆలోచనలో మునిగిపోయింది, నేను పలకరించగానే ఉలిక్కిపడింది. ఆమె ప్రతి అవయవంలో భయమే ద్యోతకమైంది. లోపలికి వెళ్దామని పిల్చాను, కాని రాలేదు. అక్కడే నిలబడిపోయింది. ఆమె పరిస్థితికి ఆశ్చర్యపడ్డాను. ఎవరికీ తట్టనివిధంగా ఒక సమస్యను పరిష్కరించింది. అదే జీవన్మరణ సమస్య! మరి మరురోజు అలా బేలగా ఎందుకు మారిపోయిందో అర్థం కాలేదు. ఒకవేళ రవీంద్ర కేమైనా.... లేదు. అతడు లోపలే మంచంమీద కూర్చుని వుండటం చూశాను. అయితే ఏదో జరిగింది. చెప్పరాని దేదో ఆమె మనస్సును కలచివేస్తోం దన్న అనుమానం నాలో బయలుదేరింది. ఆ రోజంతా బయట బయటే తప్పుకొని తిరగటం కనిపెట్టాను. ఏదైనా అడిగినప్పుడు ఇచ్చివెళ్ళేది. ఆమె మనః ప్రవృత్తి అంతుచిక్కలేదు నాకు. ఆరోజు రాత్రంతాకూడా మధ్య మధ్య ఎక్కిళ్ళతో ఏడుపు వినబడిందట రవీంద్రకు.

"కోలుకుంటున్న రవీంద్రకూడ ఆమె పరిస్థితిచూసి దిగజారిపోతున్నట్లు కనిపించాడు. దాదాపు పన్నెండువందల రూపాయల విలువగల వజ్రపుగాజులను యిచ్చివేసి తనను కాపాడిందని తెలిసి రవీంద్రసంతోషం కట్టలు తెగి ప్రవహించింది. ఆ విషయాలన్నీ నాతో చెప్పాడు. తరువాతి వారంలో దగ్గరున్న పట్నం వెళ్ళినప్పుడు ఆ గాజులకై ఆర్డరిచ్చివచ్చాడు. ఆ సంగతి చెబుతుంటే ఒక్కమాటా మాట్లాడలేదట. తల నొస్తుం దంటూ వెళ్ళి పడుకుందట.

"ఆతర్వాత పనుల ఒత్తిడిలో ఎవరమూ కలుసుకోలేకపోయాం. పని ముబ్బరంగా సాగిపోతూంది. క్రొత్తదారి ప్రారంభోత్సవానికి తేదీ దగ్గరపడుతూ వచ్చింది. తరతరాలుగ మూగవోయిన ఆ కొండలోయల్లో సైలింజన్ల ధ్వనులు ప్రతిధ్వనించాయి. ఆ రహదారికి కారకులైన మా అందరిలోనూ సంతోషం చిందులుత్రొక్కింది. కాని రవీంద్రముఖంలో మాత్రం విషాదచ్ఛాయలు కనబడ్డాయి. కుసుమ పరిస్థితి రోజురోజుకూ క్షీణించిపోతోం దని చెప్పాడు. రవీంద్రను చూస్తేనే ఆమెలో భయం అలుముకునేదట. ఒక్కరాత్రే గుడారం బయట

కూర్చుని వచ్చిపోయే రైలు ఇంజన్ల వైపు చూస్తూ వుంటుందట."

"ఆ క్షణంనుంచీ ఒక్క విషయంలో మాత్రం నేనాశ్చర్యపడేవాణ్ణి చంద్రం గారూ! ఒక కథలోని ముందు సన్ని వేశాలను ఒక్కొక్కసారి మనం చెప్పగలం. కాని అదే—జీవితంలో, కొన్ని విషయాలు తెలిసినా, ముందు జరగబోయే ఘట్టాలను మసకగా నైనా ఊహించటంలో మనం ఎందుకు విఫలుల మౌతామో? నా మట్టుకు మాత్రం నేనూహించ లేకపోయాను-కుసుమ ఆత్మహత్య చేసుకుంటుందనీ, తన అమూల్యమైన జీవితాన్ని ఒక రైలుఇంజన్ చక్రాలక్రింద అంతం చేసుకుంటుందనీ కాస్త చూచాయగా తెలిసినా—ఆమెను కాపాడేందుకు మానవప్రయత్నం చేసేవాళ్ళం."

"ఆమె అంతపని చేసిందా?" అని కేక వేసినంత గట్టిగా అడిగాను. కథలోలా లీనమైపోయిన నేను ఒక్క సారి బయటి ప్రపంచంలో పడ్డాను.

రాజశేఖరం లేచి వెళ్ళి ఏవో కొన్ని కాగితాలు తెచ్చి క్యాంప్ కాట్ పై పెడ్తూ "ఇదో ఆమె వ్రాసిపెట్టిన ఉత్తరం. వాటిని నాశనంచేసే శక్తి, ధైర్యమూ నాలో లేకపోయాయి" అన్నాడు.

అతని కంఠం గాద్గదికమైంది. నా కళ్ళలోనే నీళ్ళు తిరుగుతున్నపుడు, ఆ పరిస్థితిలో జీవించి, ఆ ఇద్దరి జీవితాలతో పరిచయం పెంచుకున్న ఆ వ్యక్తిలోనిబాధ ఎలాంటిదో చెప్పలేను.

"పిచ్చిపిల్ల! భర్త అలాంటి సంఘటనలో వున్నప్పుడే అంత గుండె నిబ్బరంతో ధైర్యంగా ప్రవర్తించిందే. మరి ఒక్క ఆలోచనమాత్రం ఆమె హృదయంలో ఎందుకు కలగలేదో నాకు అర్థంకాకుండా వుంది. నాతో అన్ని విషయాలు చెప్పివుంటే ఈ సమస్యా పరిష్కారానికి ప్రయత్నం చేసేవాణ్ణి....అయిపోయింది చంద్రం గారూ! అయిపోయింది. ఒక నిండు జీవితం బలై పోయింది. ఈ పర్యాయం కూడా అంతా జరిగాకే నాకు తెలిసింది. రవీంద్ర పెళ్ళాం రైలుక్రింద బడి చనిపోయిం దని ఎవరో వచ్చి చెబితే తక్షణం రవీంద్ర గుడారానికి వెళ్ళాను. రవీంద్ర ఒక్కసారి నన్ను పెనవేసుకపోయాడు. 'రాజశేఖరం గారూ! ఈ ఘోరం చూచారా?' అంటూ ఈ ఉత్తరం నా చేతిలో పెట్టాడు," అని నావైపుకు త్రోశాడు ఆ ఉత్తరాన్ని. వణుకుతున్న చేతుల్తో ఉత్తరం విప్పాను....

"శ్రీవారి చరణసన్నిధికి,

నన్ను క్షమిస్తారని ఆశిస్తూ ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. నిన్న రాత్రి మీరు ఎంతో లాలనగా, ప్రేమతో దగ్గరికి తీసి, నాలో పేరుకపోయిన

భయాందోళనలను తుడిచివేయా లని ప్రయత్నించినప్పుడే మీకు అన్ని విషయాలు చెప్పవలసి వుంది. కాని ధైర్యం చాలలేదు. మొట్టమొదటే నిజం చెప్పేందుకు లేని ధైర్యం, ఆడిన అబద్ధం నిజమని ఒప్పుకోనేప్పుడు మాత్రం ఎలా వస్తుంది?

నేను ఈ ప్రాంతాలకు వచ్చినరోజు సాయంత్రమే మన మలా వాహ్యాళికి వెళ్ళటం, డ్రైవరు కరీం తటస్థపడటమూ, మీరు ముఖం వాచేటట్లు చీవాట్లతో అతన్ని పంపటం మీకు జ్ఞాపక ముందనుకుంటాను. ఆ తర్వాత కూడా అయ్యగారితో చెప్పి ఏదైనా ఉద్యోగ మిప్పించ మని నా దగ్గరికి రెండు పర్యాయాలు వచ్చాడు. మీకు చెబితే మళ్ళీ అదొక గొడవ జరుగుతుందని నేను మీతో చెప్పలేదు. వాడొక దుర్మార్గుడని జైల్లోకూడా వుండి వచ్చాడని మన డ్రైవరు చెప్పాడు. కాని అది నిజం కాదని నా ముందు ఏడ్చేవాడు కరీం. ఓ కారు ప్రమాదంలో యిరుక్కున్న తన యజమానిని రక్షించేందుకు జైలుకు వెళ్ళాడట.

మనము తరచూ బయటికి వెళ్ళి వస్తున్నపుడు అదొకవిధంగా మనలను చూచేవాడు.

ఆ కొండలను చూచి జీపులోవచ్చే ఆ సాయంత్రం ఇద్దరమూ ఊహాలోకాల్లో సంచరిస్తూ వున్నాం. అప్పుడే వర్షం ప్రారంభ మైంది. పీ ఆఫీసు ఉద్యోగంలో ఒక్కొక్క మెట్టే మీ రెలా అధిగమించగలరో అవన్నీ చెబుతూపోయారు. కాని ఒక్కసారి జీపు తలక్రిందు లయ్యేసరికి యిద్దరమూ అధఃపాతాళానికి జారిగిపోయాం. 'కుసుమా! అయిపోయింది. ఇక కష్టాలకు యిదే మొదలు' అనేసరికి మీరు స్పృహ కోల్పోయారు.

ఆ క్షణంలో నా కళ్ళముందు మన ఇంటి పరిస్థితు లన్నీ అగుపించాయి. బడిపంతులుగా జీవిస్తూ, తన సర్వస్వాన్ని త్యాగం చేసి మీకు పెద్దచదువులు చెప్పించి, మిమ్ములనూ ఓ గౌరవనీయుడిగా, మానవుడిగా సమాజంలో నిలబెట్టిన వృద్ధులైన మామగారూ, ఇంకా హైస్కూలు చదువులైనా పూర్తి కాని మీ తమ్ముళ్ళూ, పెళ్ళికాని చెల్లెళ్ళూ—అందరూ నా ముందు మెదిలారు. ఆ కుటుంబానికంతా మీ రొక్కరే ప్రస్తుతం ఆధారం. వాళ్లంతా మీ మీదే ఆశలు పెంచుకున్నారు. అవును మరి! విత్తు నాటి, ఎండనక వాననక రక్షిస్తూ, పెంచి పెద్దచేసిన వాడు ఆ వృక్షపు నీడన వుందా మనుకోవటంలో ఎవరి ఆస్తినీ, ఎవరి హక్కునూ లాక్కోవటం లేదుగా! వీళ్ళందరితోబాటు యింకొక వ్యక్తి గూడా నా ముందు నిలబడ్డాడు. ఉద్యోగంకోసం యమయాతన పడు

తున్న కరీం—తన యజమానిని రక్షిం
చుకునేందుకు జైలుకువెళ్లిన డ్రైవరు—

మీకు కావలసిన డాక్టరు సహాయం
లభించగానే నేను కరీం గుడిసెకు





వెళ్ళాను. అతడికి ఈ ప్రమాదాన్ని గూర్చి అప్పుడే తెలిసిపోయింది. లోపలినుండే విషపునవ్వులతో చూచాడు. కాని కోపంగా 'మీరు వెళ్ళిపోండి. మీ ముఖం నేను చూడదలచుకోలేదు' అంటూ అరిచాడు.

నా కళ్ళనీళ్ళు ప్రవహించే పర్యంతమూ నేను ఎంతగానో ప్రాధేయపడ్డాను. అతణ్ణి పరిశీలిస్తోంటే అతడిలో ఓ క్రొత్త ఆలోచన తట్టినట్లుంది. నా వంటిమీ దున్న ఆభరణా లన్నింటినీ అతని ముందు ఒలిచిపోశాను. అతి దైన్యంగా అతని ముందు 'ఇవి తీసికొని నా భర్తను కాపాడ' మంటూ మోకరిల్లిపోయాను.

ఒక్క పిచ్చినవ్వు విన్పించేసరికి కళ్ళు తెరిచాను. కరీం ఒప్పుకునేటట్లే కనబడింది. ఏవో పాడుకూతలు కూస్తూ ఆ ఆభరణా లన్నింటినీ తిరిగి ధరించమన్నాడు.

అలాగే చేసి నిలబడ్డాను.

'ఇక ఆలస్యం చేస్తే లాభంలేదు. పోలీసులు వస్తారు' అంటూ అతన్ని త్వరపెట్టసాగాను.

నా దగ్గరగా వచ్చినిలబడుతూ, 'బంగారుఆభరణాలు నా కేం వద్దు. ఇంతకుక్రితం ప్రమాదంలో బయటపడ్డ వ్యక్తే నాకు కావలసినంత యిచ్చాడు. ఈ పర్యాయం మాత్రం నాకు కావలసింది' అంటూ నావైపుకు రాసాగాడు. అతని కళ్లల్లో, వికరగబడుతూన్న ఆ నవ్వులో పశువాంఛ బయట పడ్డది.

ఆతర్వాత ?....ఏం జరిగిందో చెప్పు మని మాత్రం నన్నాజ్ఞాపించకండి. సంఘం స్త్రీపట్ల చూపే పక్షపాతంవల్ల నీతివిషయంలో అబల ఎప్పుడూ జాగ్రత్తగానే వుంటుంది. కొందరు స్వార్థపరులు ఏర్పరచిన ఈ నీతి రేఖల సరిహద్దుల్లో స్త్రీ బ్రతకాలి కాబట్టి — స్త్రీ ఎప్పుడూ అవినీతిని ఆరాధించదు. కాని విధి బలవత్తరం. ఆ కారణంగా దుష్టశక్తులు విజృంభించి, ప్రభావాన్ని ప్రసరింపజేస్తే వాటిని గుండె ధైర్యంతో ఎదుర్కొనే శక్తినీ, సామర్థ్యాన్నీ, సమయస్ఫూర్తినీ కోల్పోయి లొంగిపోయాను. నాకిక మార్గాంతరం కన్పించలేదు. నన్ను నేను నాశనం చేసుకుంటేనే తప్ప మిమ్మల్ని కాపాడుకోలేక పోయాను. ఆలోచించేందుకు టైంకూడా ఎక్కువలేదు.

జీవరహితమైన నా శరీరం నేల వ్రాలింది. మీ సర్వస్వాన్ని సమర్పించిన ఆ విషపుఘడియలు గడిచాక, 'ఇంతకూ నీ మగడు అదృష్టవంతుడు' అంటూ ఆఫీసువైపు వెళ్ళిపోయాడు కరీం.

తదుపరి కాలమంతా విషాద నిశీధిలో గడిచిపోయింది. కాని మిమ్మల్ని అరెస్టు చేయలేదని తెలిసిన తర్వాత హృదయం కాస్త తేలిక పడింది. నా సంతోషమంతా మీ వికసిత వదనంలో చూచుకొని మురిసి పోయాను. కొన్ని రోజుల తర్వాత ఆవ్యక్తి కేమిచ్చా వని మీ రడిగినపుడు నా హృదయం ఒక్కసారి సమ్మెట ప్రేటితో బ్రద్దలైపోయింది. ఏదో చెప్పి. బయటికివెళ్ళి నా వజ్రపుగాజులను మన తోటలో గొయ్యి తీసి దాచిపెట్టాను. మీ గౌరవం, మీ హోదా, మీ భవిష్యత్తు కేవలం రెండుగాజులతో కాపాడ బడిం దని తెలిసినప్పుడు మీరు నన్నెంతగా అభినందించారో మన హృదయానికి గాక మరెవరికి తెలుస్తుంది? రాజశేఖరంగారు నన్ను సావిత్రితో పోల్చారు. రోజులు గడుస్తున్నకొద్దీ నా సున్నిత హృదయపు రంపపు కోతను భరించుకోలేకపోయాను. బాధతో బిగ్గరగా ఏడ్వాలనిపించేది — కాని నోరు కట్టివేయబడింది.

ఈరోజు ఉదయం అకస్మాత్తుగా, అనాలోచింతగా మీరు తోటపనికై తోటలోనికి వెళ్ళారు. నా దురదృష్టాన్ని ఏమని నిందించను చెప్పండి. ఆ గాజులను తీసి ఆశ్చర్యంతో నాకు తెచ్చియిచ్చారు. నేనేమీ చెప్పలేక పోయాను, అప్పుడే రాజశేఖరంగారు కూడా వచ్చారు.

తీవ్రంగా ఆలోచించాను. చావాలని నేను కోరలేదు. ఏవ్యక్తి చని



భర్త : నేనూ ఇంకో అమ్మాయీ ఏదైనా మాట్లాడుకుంటున్నప్పుడు విన్నంత శ్రద్ధగా నేను నీతో చెప్పినవి వినవేం ?

పోవా లనుకోడు. కాని మార్గాంతరం కనిపించలేదు. మీకు ఇంకొక అబద్ధం చెప్పివుండేదాన్ని. జైలునుండి వచ్చి తీసుకవెళ్తానని అతడే యిక్కడ దాచి వెళ్ళా డని నమ్మించేదాన్నే. కాని ఎన్నని అబద్ధాలు ? ఈ అబద్ధాల అగ్ని పర్వతం ఏనాడైనా బ్రద్ద లవుతుంది. కరీం జైలునుంచి విడుదల అయిన తర్వాత ఈ విషయం తెలిస్తే ?!

ఒకవేళ అతనినోటిని మీరు కట్టివేయ వచ్చును. కాని నా శరీరంలో దిన దినానికి పెరుగుతున్న ఈ మలినాన్ని ఎలా తుడిచివేస్తారు ? 'రథచక్రపు యిరుసుయొక్క సీల జారిపోతే ఆరథం అక్కడే పడి కూలిపోతుంది. కాని మానవుడి శీలము జారిపోతే ఆవ్యక్తి తిన్నగా పయనించేది అధఃపాతా ళానికే' అని ఎవరో అన్నది ఎంతనిజం ! గమనం, గరిమనాభి తప్పిన జీవితాలకి శాంతిలేదు. విశ్రాంతిలేదు. నలిగిన కుసుమం దైవచరణాలను ఎలా స్పృశించగలుగుతుంది ? వాడిపోయి. సంఘపు ఇనుప పాదాలక్రింద నలిగి పోకుండా వుండేందుకే ఈ గాలి సహా యంతో ఈ అరణ్యంలోని రైలుపట్టాల మధ్య శాశ్వత విశ్రాంతి తీసుకుందా మనే నిర్ణయించుకున్నాను. కలసి పనిచేసే ఈ రెండు రైలుపట్టాలు మన జీవితాల్ని వేరుచేస్తున్నాయి... ఎంత విచిత్రం ! !

ఇక బండికి గంట కొట్టారు. టైం లేదు. వెళ్తాను మరి.

—కుసుమ."

నాలుగైదు కన్నీటి ముక్కలు

ఉత్తరంపై పడటంతో చేతిలోని ఉత్తరాన్ని తీసి మడిచాడు రాజశేఖరం.

"ఇక యింతకంటే ఏముంది చంద్రం గారూ! రాలుతూన్న పుష్పాన్ని చూచి ఓ రెండు కన్నీటిచుక్కలు రాలిస్తే ఆ అదృష్టం ఆ పుష్పానిది కాదంటారా? అది అంతకంటె ఎక్కువా కోరదు. మనం యివ్వగలిగింది కూడా అంతే. ఆ సానుభూతే చాలు జీవిత నాటకరంగంపైనుండి నిష్క్రమించిన ఆ జీవి ఆత్మశాంతికి...ఏదో ప్రమాదవశాత్తూ చనిపోయిందని కేసు కొట్టివేశారు పోలీసువాళ్ళు. నేనూ ఈ విషయం ప్రభుత్వానికి వ్రాశాను. ప్రమాదాన్ని సూచించే ఓ రోడ్డుగుర్తు నిలబెట్టించమని ప్రభుత్వంవాళ్ళు వ్రాశారు. అంతే చంద్రంగారూ! మీరు వెళ్ళే టైం అయిందనుకుంటాను. మిమ్ములను ప్రెస్ క్యాంపులో విడిచి వస్తాను పదండి" అంటూ జీపుదగ్గరికి దారి తీశాడు.

జీపులో వెళ్ళేప్పుడు ప్రమాదం జరిగిన ప్రదేశం చూశాను. రోడ్డు గుర్తుగా నిలబడ్డ ఆబోర్డుపై, "ప్రమాదము – రైలుపట్టాలను దాటువారు ప్రమాదము కలిగినచో దానికి వారే బాధ్యులు" అని కొట్టొచ్చినట్టుగా అక్షరాలు కనబడ్డాయి.

జీపును స్టార్టు చేస్తూ రాజశేఖరం తనలో తానేదో అనుకోవటం నాకు వినిపించింది, "ఆ పొడిపదాలకు అర్థం సూచించదు చంద్రంగారూ! జీవితంలో ఎదురుపడ్డ ప్రమాదభరితమైన క్రాసింగ్ లన్నింటినీ ఎవరి బాధ్యతలపై వారే దాటాలని ఆమెకు తెలుసు."



# చక్రనేమి

## కోడూరి కౌసల్యాదేవి

జరిగిన కథ

*[కొద్దిరోజుల కాలక్షేపంకోసం ఇంటికి వచ్చేసిన రఘుకు ఇంటిపరిస్థితు లన్నీ గ్రహించటాని కెంతోకాలం పట్టలేదు. ముఖ్యంగా పద్మ విషయంలో— ప్లీడరు శేషయ్యగారి కొడుకు ప్రకాశంతో జరిగే ప్రణయగాథ విషయం సంగతి తేల్చేసేయా లని ఆ తండ్రీకొడుకులను కలుసుకొని, వృథాశ్రమ పడి, ఇంటికి తిరిగివచ్చి, ఇంటిలోని సమస్యా లన్నింటి పరిష్కారానికి మార్గంకోసం అన్న పాణితో ఆలోచిస్తాడు..]* — ఇక చదవండి.

మూల నున్న టీపాయ్‌మీది పద్మావతి శ్రీనివాసుల దంతపు విగ్రహాలు చూస్తూ ముగ్ధుడై పోయిన రఘు "అవెక్కడి వన్నయ్యా? చాలా బావున్నాయి." అన్నాడు.

"యేమో, మీ వదిననే అడుగు." అన్నాడు పాణి చిలిపిగా. రఘు నవ్వుతూ వదినవైపు చూచాడు. మాధవి చిరునవ్వుతో ఆ గదిలోంచి వెళ్ళిపోబోతూండగా రఘు అర్థమైనట్టు తల పంకించాడు. "ఇందులో యేదో ప్రణయగాథ దాగివున్న ట్లుంది. పోనీ చెప్పొద్దుకాని ఒకసా రిలా రా వదినా."

నిల్చున్నచోటనుండే "ఏమి టని'' ప్రశ్నించింది మాధవి.

పెట్టె తీసి రఘు ఒక అట్టపెట్టె తీశాడు. "నీకు పెళ్ళి కానుక" అంటూ మాధవి చేతిలో వుంచాడు: జాగ్రత్తగా విప్పి చూచింది మాధవి. నామశ్రవణ మాత్రంతోనే ఒడలు పులకింప జేసే మనోహర ప్రేమైక మిధునం — రాధా మాధవులు, మురళీ మోహనుని పాదాల వద్ద నిమీలిత నేత్రాలతో ప్రేమాంజలి ఘటించి పూజించుతున్న రాధిక!

''చాలా బాగుంది." మురిసి పరవశమై పోతూ పాణికి అందించి మాధవి!

"బాగుంది" అని అందుకున్నాడు పాణి. "అక్కడ పద్మా శ్రీనివాసుడు, ఇక్కడ రాధికా కృష్ణుడు." తూర్పు వైపు నున్న డ్రాయర్ మీద ఆ విగ్రహా న్నుంచి ఫ్లవర్ వాజ్‌లోని తెల్ల గులాబీ త్రుంచి విగ్రహం పాదాల దగ్గరుంచి నమస్కరించాడు పాణి. మాధవికూడ అప్రయత్నంగా నమస్కరించింది.

"వారేవా" చప్పట్లు చరిచాడు రఘు. "సరిగ్గా మీ యిద్దర్నీ ఆవిగ్రహానికి నమస్కరిస్తూ అలాగే వూహించుకున్నాను నేను. ఆహాహా ; సమయానికి కెమేరా లేదు,'' అంటూ తన గదిలోకి నడిచాడు రఘు.

''కట్టిపెట్టరా హాస్యం.'' నవ్వాడు చక్రపాణి.



ఉదయం మాధవి వంటగదిలో పీటమీద కూర్చుని కాఫీలు కలుపుతూంది అక్కడే పూజచేసుకుంటూన్న జానకమ్మ, దగ్గరే కూర్చున్న పెద్ద కూతురికి బుద్ధులు నేర్పుతూంది



''కలవాళ్ళెలాతిరిగినా నెగ్గుకు రాగలరమ్మా, రకరకాల టక్కులు చూపించి, ఎటువంటివాడినైనా వలలో వేసుకుని పెళ్లాడెయ్య గలరు మన కటువంటి వగలు చేతకావు జాగ్రత్తగా వుండాలి ''

మాధవి - ఆశ్చర్యపోయింది. కూతురికి బుద్ధులు చెప్పడంకన్నా అందులో కోడలిపై నిందలే ఎక్కువగా వున్నాయి. చిన్నవాళ్ళకు పెద్దవాళ్ళు బుద్ధి నేర్పే విధానం అదేనా ? అయినా తనను కానట్లే తనపని తాను చేసుకుపోసాగింది.

కాఫీ ఇవ్వబోయిన మాధవిచేతిని విసురుగా త్రోసేసింది పద్మ. చేతిలోగ్లాసు ఖళ్ళున క్రిందపడి కాఫీ నేలపాలైపోయింది. అర్ధంగాక విస్తుబోతూ అందరిముఖాలు చూడసాగింది మాధవి.

''ఎందుకంత కోపం పద్మా ?'' అనడిగింది.

"ఏమీ ఎరగనట్టు, చాటున వాళ్ళకు నూరిపోసి ఎదరమాత్రం తేనెలా మాట్లాడతావు. నువ్వసలు నాతో మాట్లాడకు.''

''నాకేమీ అర్ధకావటంలేదు." అంది మాధవి లోలోన తనూ వదిన సరోజినీ ఎంత సఖ్యతతో వుండేవారో ఆలోచించుకొంటూ.

"పెళ్ళవకముందు నువ్వు మా అన్నయ్యతో తిరుపతి వచ్చి కొండలమీద రాత్రనక పగలనక షికార్లు సాగించటం, అందర్నీ ఎదిరించి పెళ్ళి చేసుకోవడం నే నెరుగనా ? ఇంకా రెండు నెలలైనాకాలేదే ? నువ్వు నాకు పతివ్రతలా నీతులు చెప్పొచ్చావ్ ?"

"నీ కంతా అర్ధమైంది. అయినా నీకు నే నేం నీతిబోధ చెయ్యలేదు. చేసినది మీ అన్నలు. అయినదానికీ కానిదానికీ హద్దుమీరి మాట్లాడితే తర్వాత విచారించవలసి వస్తుంది.''

"నేను చెప్పేదీ అదే. ఎవరి హద్దులలో వా ళ్ళుండటం మంచిది...''మాట్లాడ్తూ మాట్లాడ్తూ ఠక్కున ఆగిపోయింది పద్మ, వరండాలోకి చూస్తూ. కారణం తెలుసుకోవటానికి మాధవికూడ అటుచూచింది. రఘూ, ఇందిరా కబుర్లు చెప్పుకొంటూ అటే నడుస్తున్నారు.

మాధవికూడ మాట్లాడకుండా క్రింద ఒలికిన కాఫీ బట్టతో ఒత్తసాగింది. కొడుకు రాక గమనించని జానకమ్మమాత్రం ఇంకా గొణుగుతూనేవుంది. ఆ సన్నివేశం చూచిన రఘూ, ఇందిరా మరో విధంగా అర్ధంజేసుకున్నారు.

"చెయ్యి జారిపోయిందా వదినా ? నేను తుడుస్తాలే,'' అంటూ వదినచేతిలో పని అందుకుంది ఇందిర.

రఘు జాలిగాచూచాడు వదినవైపు; ''పోనీ కొంత అలవాటయ్యేవరకు వాళ్ళేవరో చేస్తారుగా ? అన్నిటికీ నువ్వు బాధపడడం దేనికమ్మా వదినా ?''

మాధవి మాట్లాడలేదు. మౌనంగా కాఫీ అందించింది రఘుకు.

ఆ గంభీరత్వాన్ని హాస్యంలోకిదింపి తేలికపరిస్తేకాని లాభం లేదనిపించింది

రఘుళ్ళు. "ఎంత చదువుకున్నా ఆడవాళ్లు అంతో ఇంతో పని చెయ్యివలసేవుంటుందన్న మాట ! అంచేత వదినా, మీ అమ్మాయిల్ని మాత్రం యిలా పెంచకు: బాగా పని నేర్పు." అన్నాడు నవ్వుతూ.

"అప్పుడే అమ్మాయిలవరకూ వెళ్ళిపోయావే!'' పకపకా నవ్వేసింది ఇందిర.

అప్పటికే మాధవి మాట్లాడలేదు. గంభీరంగా రఘువైపు తిరుగుతూ "చూడు చిన్నబాబూ. ఆ సంగతికేంగానీ- పద్మవిషయమై నేను మిమ్మల్నేమైనా హెచ్చరించానా విన్న?" అనడిగింది.

ఆ సూటిప్రశ్నకు తెల్లపోయాడు రఘు. "లేదే"? అన్నాడు అయోమయంగా.

"నిన్నటి మీ మందలింపులకు కారణం నే ననుకుని బాధపడ్తున్నారు తల్లీ కూతుళ్ళిద్దరూ. అందుకే కాఫీగ్లాసు విసిరేసింది పద్మ.

''నా కెవరిపైనా ఎవరికీ చాడీలు చెప్పే అలవాటు లేదు; అసహ్యంకూడాను. వినేవాళ్లయితే — నేను చెప్పగల అర్హత వున్నదాన నని అన్పిస్తే నేనే చెప్తాను. లేదా వూరుకుంటాను. రకరకాలుగా వూహించుకు బాధపడి బాధపెట్టడం నాకు చేతకాదు."

రఘు ఏమీ మాట్లాడలేకపోయాడు.

ఇందిర అందుకుంది; ''నీకు అన్నింటికీ వదినే కన్పిస్తుం దక్కా ? నన్నుకూడ చెప్పొద్దని మందలించింది తెలుసా? వది నెంత మంచిదో నువ్వెరగవ్. విన్న అన్నయ్యలు రకరకాలుగా బాధపడ్తూంటే పోనీ అతడు మంచివాడేమో! వివాహం చేసుకుంటాడేమో! అతనినరిపెట్ట జూచింది. ఆమాటమీదే అన్నయ్య రాత్రికి రాత్రే రాయబారం వెళ్ళాడు. చేతనైతే మంచిగా ప్రవర్తించు. అందర్నీ అనుకోవడం దేనికీ?"

''నువ్వుకూడా బుద్ధులు చెప్పేదానవయ్యావటే తల్లీ నేటికి?" అంది దీర్ఘాలు తీస్తూ జానకమ్మ.

''బుద్ధి తెలిసినవాళ్ళు ఎవరైనా చెప్పొచ్చు. వాళ్ళా చెప్పాలా-వీళ్ళా చెప్పాలా అనే అహంకార మున్న నీవంటివాళ్ళు తర్వాత గట్టిగా లెంపలు వాయించుకోవలసి వస్తుంది. అనవసరంగా వదిన ననుకోవటం దేనికీ?" అన్నాడు రఘు.

"న న్నన్నా రని నా కేచింతాలేదు. కాని విలువున పాడై పోతూంటే చూస్తూ వూరుకోలేకా — ఇంటి పరువు మర్యాదల సంగతికి సంబంధించినది గనుకా ఈ మాత్రమైనా మాట్లాడవలసొచ్చింది. నే నస లెవరేమన్నా వినీ విననట్లే పోతుంటాను." అని అక్కడినుంచి వెళ్ళిపోయింది మాధవి భర్తకు కాఫీ ఇచ్చే నెపంతో.

రఘు కోపంగా చెల్లెలి వైపు తిరిగాడు. "ఏం పద్మా! నువ్వు నీ స్వభావం మార్చుకోవా?"

పద్మ మాట్లాడలేదు.

"ఇంకోసారి వది న్నేమైనా అన్నట్లు తెలిసినా, గడప దాటి అనవసర షికార్లకు వెళ్ళినట్లు తెలిసినా వూరుకోను, జాగ్రత్త." హుంకరించాడు.

"ఏం ఇవ్వాళ కాలేజీకి వెళ్ళే ప్రయత్నంలో వున్నట్టు లేరు?" అంది భర్తను మాధవి.

"ఆఁ, వెళ్ళడం లేదు. నిన్న చెప్పటం మరిచాను. ఇవ్వాళ బావగారు భార్యా సమేతుడై వస్తా మన్నారు. అందుకూ" అన్నాడు.

"ఎవరు? కేశవన్నయ్యా!" అంది ఆశ్చర్యంగా.

"ఆఁ. నిన్న సినిమాలో చెప్పారు. మధ్యాహ్నం వస్తారట. కొంచం సిద్ధంగా వుండాలి."

"సిద్ధం అంటే?" అడిగింది నవ్వుతూ.

"తెలియనట్టు!" పాణికూడ నవ్వాడు. "చెల్లెలి సంసారం చూద్దామని అన్నగారూ, ఆడపడుచు దాంపత్యం చూద్దామని వదినగారూ వేంచేస్తూంటే మర్యాద లోపం జరగకూడదు"

"రానివ్వండి. పరాయివాళ్లు కాదుగా - హడలిపోతూ మనం మర్యాదలు చేయడానికి — వాళ్ళు లోపా లెన్నటానికీ"! అంటూనే వెళ్ళిపోయింది మాధవి.

చక్రపాణి కవగత మైంది భార్య మనస్సు. "కోడ లంటేనే ఇష్టంలేని అత్తగారు ఆమె తరపు బంధువులకు మర్యాదలు చెయ్యటంలో సహకరించదు. అది తెల్సిన కోడలు అసలు మర్యాదలు చెయ్యడానికే ప్రయత్నించదు! ఎలా!" కాస్సేపు ఆలోచించిన పాణి సమస్యను రఘు ముందుంచాడు.

"ఇదో పెద్ద సమస్యా?" తేలికగా చప్పరించేశాడు రఘు. "నే నెటూ యింటి దగ్గరే వుంటానుగా. నా ఎదుట ఎవరూ ఎవరిగురించీ అమర్యాదగా మాట్లాడలేరు. ఇక మిగిలినవాటికి ఇంట్లో వదినా, ఇందిరా వున్నారు. వూరినిండా కావలసినన్ని హోటళ్ళు. ఎలాగో నే నేర్పాటు చేస్తాన్లే."

మాధవీ, ఇందిరా శ్రమపడి ఇల్లంతా వున్నంతలో అందంగా సర్దారు, ఇద్దరూ మంచి దుస్తులు వేసుకొని, తల దువ్వుకొని కూర్చున్నారు,

ఇందిర దొడ్లో కనకాంబరాలూ, గులాబీలూ తెచ్చి దండలు గ్రుచ్చడానికి

కూర్చుంది. మాధవి పువ్వులూ, ఆకులూ కలిపికట్టి ఫ్లవర్ వాజ్‌లో అమర్చుతూ ప్రక్క గదిలో వున్న పద్మను చూచింది.

"పద్మా ఎందు కా పడక ? కాస్త తల దువ్వుకుని, బొట్టు పెట్టుకోరాదూ ?"

"నీకేం నేను పడుకుంటే. నాతో మాట్లాడొద్దని చెప్పలేదూ ?" ఖస్సుమంది పద్మ

"నువ్వు వద్దన్నా చెప్పటం నా విధి. ఎవరైనా వస్తే అలాగే కన్పిస్తావా అసహ్యంగా ? అలా వుండటం ఆరోగ్యకరం కూడా కాదు."

"పోనీ వదినా, దానితో ఏమిటి నీకు ? ఏమైనా చిన్నపిల్లా ? మరీ అంతగా బొట్టు పెట్టుకోమనీ, జడ వేసుకోమనీ కూడా చెప్పటానికి."

అక్కడే కొంగు పరచుకు పడుకొన్న జానకమ్మ కలుగజేసుకొంది "అయితే ఎవరొస్తున్నారేమిటమ్మా, అంత హడావుడిగా వున్నారు ? స్నేహితులా, బంధువులా ? అయినా బంధువు లెవరున్నారులే రావటానికి ?" అంతలోనే హేళనలోకి దిగిపోయింది.

పుట్టింటివారు తనను వదులుకున్నా రనే విషయాన్నే అత్తగా రా విధంగా ఎత్తి చెప్తోం దని గ్రహించిన మాధవి మాట్లాడలేకపోయింది.

ఇందిర ఫెడీమని జవా బిచ్చింది "ఇల్లూ, ఒళ్ళూ శుభ్రంగా వుండటానికి కూడా ఎవరైనా రావాలేమిటి ? అయినా వచ్చేవాళ్ళు చెప్పి వస్తారా, ఎప్పుడో హఠాత్తుగా దిగుతారు "

రఘు, పాణీ బజారునుంచి రావడంతో సంభాషణ ఆగిపోయింది. ఏవేవో సరకులు తేవడం చూచి జానకమ్మ అనుమానం మరింత బలపడింది. మాధవి లేచి ఇద్దరికీ మంచినీ ళ్ళిచ్చింది తెచ్చిన సరకులు గదిలో పెట్టివచ్చి ఇద్దరూ హాల్లో కూర్చున్నారు. ఇందిర కట్టిన పూలు కొన్ని తను తలలో పెట్టుకుని, కొన్ని వదిన తలలో పెట్టింది.

"అక్కా, ఇదిగో నీ పూలమాల యిక్కడుంచాను, కావలసినప్పుడు తీసికో " అంది మరోమాల పళ్ళెంలో వుంచి.

"ఏం, వద్దందా ? " అడిగాడు రఘు.

"దాని కేంగాని..." పాణి కలుగజేసుకున్నాడు. "రఘూ, పద్మ ఎలాగూ చదవటంలేదు గనుక ఈ సంవత్సరం దాని పెళ్ళిసంగతి చూడాలిరా అమ్మకూడ అదే అంటోంది."

ఆ సంభాషణ వినగానే జానకమ్మ ముఖం విప్పారింది. లేచికూర్చుంది "అవున్రా ఇద్దరూ ఓసరిగ్గా ఎదిగి కూర్చున్నారు. పెళ్ళి ప్రయత్నాలు చెయ్యారు మీరు "

"ఇందిర మాటకేంగాని పద్మసంగతే త్వరగా చూడాలిరా."

"అవునవును. మన ప్రాణాలు తోడెయ్యడం మానేసి ఇక వాడిప్రాణం కొరికె య్యటం మొదలెడ్తుంది. ప్చ్, పాపం, ఎవరో వాడు మందభాగ్యుడు." అన్నాడు రఘు.

పద్మ టపటపా కాళ్ళు నేలకొాడుతూ అక్కడినుంచి వెళ్ళిపోయింది దొడ్లోకి.

"ఇందిరా, మాధవీ ఆపుకుందామన్నా ఆగకుండా వచ్చేసే నవ్వుతో పడిపడి నవ్వసాగారు.

ఇదేం పిల్లలో ఒక్కక్షణం పడదు" మూలిగింది జానకమ్మ. "అందరూ వకటై ఆ దెక్కడో గాలి క్కొట్టుకొచ్చిన శ్లెందుకర్రా అలా ఏడిపిస్తారు ? "

"ఏడిపించటం కాదమ్మా. అలా గంటేకాని అది కదిలిందామరి ? అదుగో చూడు శుభ్రంగా ముఖం కడుక్కొచ్చిం దిప్పుడు," అని ముఖం తుడుచుకుంటూ అటు వచ్చిన పద్మను చూస్తూ "బొట్టు పెట్టుకుని, శుభ్రమైన దుస్తులు వేసుకుని, జడకూడ వేసుకుంటే మేం ధన్యుల మౌతాం," అన్నాడు రఘు.

నవ్వితే జానకమ్మ తిడ్తుం దనే భయంతో ఇందిరా, మాధవీ ముఖాలు త్రిప్పు కున్నారు.

''ఒరేయ్, నవ్వుల్లో దిగి అసలుసంగతి తప్పించెయ్యకు. నేను నిజంగానే మాట్లాడ్తున్నాను, ఎటువంటివాడై తే బాగుంటుం దంటావ్ ? "

"దీని తిక్క కుదర్చగల తెలివున్నవా డై తేను." అన్నాడు రఘు.

ఈసారి పాణికి నిజంగా కోపం వచ్చింది. "ఓరి వాజమ్మా, ఇలా చెత్త మాట్లా డట మెప్పుడు నేర్చుకున్నావ్‌రా ? "

"లేదన్నయ్యా లేదు, ను వ్వేదో నవ్వులాటగా అంటున్నా వనుకున్నాను."

లేచి వెళ్ళిపోబోతున్న పాణిని చెయ్యి పట్టుకు అపుజేశాడు రఘు. ''పెళ్ళి కిప్పు డేం తొందరొచ్చిం దన్నయ్యా ? అదీగాక బాగా ఖర్చుపెట్టనిదే మంచివాడు దొరకడు. నన్నుకూడా ఓ సంవత్సరం వుద్యోగం చెయ్యనీ. ఇద్దరం కలిసి రాజా సంబంధం తేవచ్చు."

"ఎందుకురా ? మూడువే లుంది, ప్రస్తుతం బ్యాంకులో. సరిపెట్టేదాం."

"మూడువేలు పెళ్ళిఖర్చులకు బొటాబొటీగా సరిపోతుంది. కట్న మేమిస్తావ్ ? ఏదేనిమిది వేలైనా లేంది ఓపాటివాడు దొరకడు."

"రఘూ!" కోపం, విసుగూ ధ్వనించాయి పాణి గొంతులో.''నాతో మాట్లాడ్తున్నా నన్న సంగతి మర్చిపోయావా ? "

సరోజిని ఆడపడుచుకు దగ్గరగా నడచి "మాధవీ !" అంది మెల్లగా భుజంపై చెయ్యి వేసి. ప్రయత్నం మీద తలెత్తిన మాధవి నేత్రాలు అశ్రుపూరితాలై వున్నాయి.

"వదినా !" రెండు చేతులతోను సరోజినిని వాటేసింది. మూగపోయిన మమతలు అశ్రురూపంలో స్రవించ సాగాయి. రఘూ, పాణీ, ఇందిరా నిశ్చేష్టులయ్యారు.

అనిర్వచనీయానుభూతిలో పరిసరాలను గమనించని అందరూకూడ "మాధవీ" అనే కేశవరావు పిలుపుతో, చైతన్యం పొందారు.

"ఒక్క నిముషమైనా విడవకుండా ప్రాణంగా వుండేవాళ్ళం. కంటి చూపే కరువైపోయిం" దంది సరోజిని కళ్ళు తుడుచుకుంటూ.

"వచ్చారా అన్నయ్యా," అని పలకరించింది మాధవి తేరుకుని.

"వచ్చానమ్మా. నువ్వు మరీ అంతిదైపోతే ? ఎల్లకాలం ఈ పట్టుదల లిలాగే వుండిపోతాయా ?"

"కూర్చోండి బావగారూ !" రఘు కేశవరావును బలవంతంగా కూర్చోబెట్టాడు.

"అవన్నీ లోపల పెట్టించమ్మా." అన్నాడు కేశవరావు ఇందిరను. అప్పుడు చూచేరు అందరూ అటు. రెండు అరటిపళ్ళ గెలలూ, ఒక ప్లాస్టిక్ పెట్టె నిండా చామంతి సంపంగి పూలు, ద్రాక్షపళ్ళ కుండ ఒకటీ, బత్తాయి పళ్ళబుట్ట ఒకటీని.

"ఏమిటి బావగారూ అవన్నీ ? ఎందుకు ?" అన్నాడు కేశవరావు.

"దయయుంచి మీ రేమీ అని నన్ను సిగ్గుపరచకండి" అన్నాడు కేశవరావు.

"చూడటాని కొస్తూ, పూలూ, పళ్లూ తేవడం కూడా ఘనమేనా; ఇవ్వవలసిన అరణాలూ, కట్నాలూ లేకపోగా" అంది మెల్లగా సరోజిని.

"మాధవీ, ఇది వుంచు." కేశవరావు చిన్న అందమైన సూట్ కేస్ ఒకటి మాధవి కందిచ్చాడు.

మాధవి మౌనంగా అందుకుని గదిలో పెట్టివచ్చింది. "అమ్మా, నాన్నగారూ కులాసాయేనా అన్నయ్యా ?" అంది మాధవి.

"ఆ", ముక్తసరిగా జవా బిచ్చాడు.

ఎవరికి ఏం మాట్లాడాలో తోచటం లేదు.

రఘు షర్బత్ తయారు చేసి తీసుకొచ్చాడు. కేశవరావూ, సరోజినీ మౌనంగా స్వీకరించారు.

"అమ్మగ్గా రింట్లో లేరామ్మా?" అనడిగాడు కేశవరావు ఇందిరను. అప్పుడు గుర్తుకొచ్చింది అన్నదమ్ము లిద్దరికీ, ఎంత పొరపాటు జరిగిందో; ముఖ్యబంధువు లొచ్చినప్పుడు ఇంటిపెద్ద ఇంట్లో వుండీ కన్పించకపోవడమా! తత్తరపాటుతో లేచివెళ్తున్న చక్రపాణి నాపుజేసి రఘు వెళ్ళాడు. ఎండవేళకదూ, నిద్రపోతున్నా రేమో" అంటూ. పాణికి తెల్సు — తల్లికి రఘు మాట త్రోసివెయ్యగల ధైర్యం లేదని; అందుకే తను వెళ్ళకుండా ఆగిపోయాడు.

హాల్లోకి వచ్చిన జానకమ్మను చూసి కేశవరావూ, సరోజినీ మర్యాదగా లేచి నిల్చున్నారు. "కూర్చోండమ్మా.... కూర్చోం...డీ." ఇస్సు మంటూ నేలమీద చతికిలబడింది జానకమ్మ.

"అంతా బాగున్నారామ్మా?" అంది యధాలాపంగా.

"ఆ, బాగేనండి." అంది సరోజని నమ్రతగా.

"అయితే కారుమీద రాలేదూ? వచ్చి వెళ్ళిపోయిందా?" తెలియనట్టు ముఖానికి చెయ్యి అడ్డంపెట్టుకుని వీధిలోకి దృష్టి సారిస్తూ అడిగింది జానకమ్మ. యదార్థం ఆమెకూ తెల్సు. కాని ఎదుటివారిని ఇరుకున పెట్టడం జానకమ్మకు ఉగ్గుపాలతో అబ్బిన విద్య.

, వివాహంపూర్వం తిరుపతిప్రయాణం చేసివచ్చాక ఒకసారి కబుర్లలో హఠాత్తుగా మాధవి "నీ కో మంచి విట్టు చెప్పనా వదినా?" అంది సీరియస్‌గా.

ఏమిటో అనుకుని సరోజిని వుత్సాహం చూపించింది.

"ముసలివాళ్ళకు కూడా హాబీ లుంటాయి." అంది గొప్పగా మాధవి.

సరోజిని కుతూహలం ఇనుమడించింది. "వున్నపళంగా పి.హెచ్.డీ ఇచ్చేస్తాను, త్వరగా చెప్పుదూ అ దేమిటో."

"అడ్డు దిడ్డు ప్రశ్నలేసి మనుష్యుల్ని ఇరుకున పెట్టడం, ఆచారా లంటూ గంతు లెయ్యడం జానకమ్మగారి హాబీ," అంది పకపకా నవ్వుతూ మాధవి.

సరోజినికూడా నవ్వింది. "ముసలాళ్ళ గోల మన కెందుకు గానీ మీ మేష్టారి హాబీ లేమైనా వుంటే చెప్పూ, ముందు ముందు వుపకరించగలవు."

సరోజినీ, మాధవీల ఇద్దరి మనస్సులలోనూ ఈ గతం దోబూమలాడి అప్రయత్నంగా పెదవులపై మందహాసాలు నాట్యం చేసాయి.

అనంతయ్యకూ, ఆదిలక్ష్మికీ తెలియక పోవటానికే ఆ విధంగా ఇద్దరూ విడివిడిగా రిక్షాలమీద వచ్చా రని ప్రతిఒక్కరూ వూహించుకోగలిగారు జానకమ్మకు ఆ సంగతి ముందే తెల్సు. అయినా అలా అడిగినందుకు మాధవీ, సరోజినీ కూడ

చిన్నబుచ్చుకుంటా రని భయపడ్డ అందరికీ కూడ ఆ యిద్దరి చిరునవ్వులూ అమి తాశ్చర్యం కల్గించాయి

కేశవరావు సంభాషణధోరణి ప్రయత్నపూర్వకంగా మార్చేశాడు. రఘువైపు తిరుగుతూ "మీరు శెలవుపెట్టి వచ్చారా ?" అన్నాడు

"అవునండీ, ఓ వారం పదిరోజు లుంటాను " అన్నాడు రఘు.

"ఇ దయ్యాక వుద్యోగమా ? ప్రాక్టీసా ?"

పాణి చెప్పాడు సమాధానం "ఇంకా ఎటూ నిర్ణయించలేదు బావగారూ;" అని మళ్ళీ "ప్రాక్టీసు పెట్టడమంటే మాటలా ?" అన్నాడు నవ్వుతూ.

"అవునులెండి" అన్నాడు కేశవరావు.

మాధవీ, ఇందిరా కాఫీలు, టిఫిన్లు తెచ్చి అందరకూ ఇచ్చారు.

"చిన్నన్నయ్య దగ్గర్నుంచి వుత్తరా లొస్తున్నాయా అన్నయ్యా ?" అడిగింది మాధవి.

"ఆ వస్తున్నాయి. ఎల్లుండి వస్తా నని వ్రాశాడు,"అన్నాడు కేశవరావు.

సరోజని చెప్పింది "పెళ్ళి కుదిరింది అతడికి, పిల్లను చూట్టానికి వస్తున్నాడు. అతడికి నచ్చితే కుదిరినట్లే."

మాధవి మనస్సు సంతోషంగా గంతులేసింది. "చిన్నన్నయ్యకు పెళ్లా ? ఏవూ రాదినా ? చదువుకుందా ?"

"ఊఁ, సంబడం" ఈసడించింది జానకమ్మ. "ఇంకా ఇంట్లో ఏమైతే నీకు వెళ్ళే అర్ధ తుంది ?''

అందరికీ చివుక్కుమంది.

''అలా గనకండి పిన్నిగారూ. ఈ పెళ్ళి అవ్వాలి. భగత్కృపవల్ల ఈ విధంగానైనా తిరిగి మాధవి పుట్టింటి గడప త్రొక్కే అవకాశం వస్తుంది—అని ఆశగా వున్నాను నేను," అంది సరోజిని బాధగా.

''మ్లాదే తనపెళ్ళికి దిక్కులేదు ఇక హన్నపెళ్ళికి వ్వస్తుంది." అంటూ లేచి లోపలి కెళ్ళిపోయింది జానకమ్మ.

అందరి ముఖాలు చిన్నబోయాయి

"ఆవిడ ధోరణే అంత. మీ రేం అనుకోకూడదు," అన్నాడు పాణి బలవంతంగా తలెత్తి.

నవ్వాడు కేశవరావు. "అనుకోవడాని కేముంది ? ఉన్నమా టన్నా రావిడ. మా అమ్మా నాన్నలకంటె వెయ్యిరెట్లు నయమేకద ! గుమ్మంలో అడుగైనా పెట్టనిచ్చారు మమ్మల్ని."




హైదరాబాద్ మహానగరంలో అత్యుత్తమ దుస్తులకు
మీరు విచ్చేయవలసిన కేంద్రములు :

★ అశోక్ డ్రెసెస్
సుల్తాన్ బజార్

★ డ్రెస్ సెంటర్
సుల్తాన్ బజార్

★ మండల్ యాపరెల్స్
ఆబిడ్స్; స్టేషన్ రోడ్

నమ్మకమైన, నాణ్యమైన, ఆకర్షణీయమైన, అత్యాధునిక దుస్తులు
అన్ని సైజులలోనూ, అతి సరసమైన ధరలకు లభించును.

ఈ దుస్తులను ధరించండి! జనాంతికంగా మెప్పును పొందండి!

"పోనీండి; ఎందుకు మనం పెద్దలను నిందించడం ? అయినా అందులో నా దోషం మాత్రం లేదంటారా ? నేను వారికి నిరాశ కల్గించాను. అదేకదూ, అంతకూ మూలకారణం ? " అన్నాడు పాణి.

''హుఁ. ఇంతమంచివారు ఈ ప్రపంచంలో ఎలా నిలబడగల్గుతారు బావగారూ?" అన్నాడు కేశవరావు సంతోషాశ్చర్యాలు మిశితమైన మనస్సుతో.

కొద్దిసేపు ఎవరూ మాట్లాడలేదు.

"తిరిగి మనం ఎప్పటికైనా కలుస్తామా ? ఇక ఇంతే నంటావా ?'' నిరాశగా అడిగింది మాధవి.

"లేదు మాధవీ అలా అధైర్యపడకు, తప్పకుండా కలుస్తాం, అలాటి కుటుంబా లెన్ని లేవు ? కొంచం ఓర్పుపట్టు,'' అంది సరోజని అనునయపూర్వకంగా.

కేశవరావు అన్నాడు "మే మందరం లేమా బిందూ ? నిత్యం మా ప్రయత్న మంతా ఏమిటనుకున్నావ్ మరి ? కొంచం ఓర్పు అవసరం. నాన్నగారు మాత్రం ? ఆయనకు నీ మీద ద్వేష మనుకున్నావా ? కాదు. వెళ్ళిపోయావని బాధ—అమిత మైనబాధ. అది ఆయనకే తెలియదు. అందరిలాగే ఆయనకుకూడ ద్వేష మని అను కుంటున్నారు. కానే కాదు "

''అవును. నేనూ అలాగే అనుకుంటున్నాను. ఆయన మాటను మే మిద్దరం మన్నించలేదని మాపై చిరుకోపం. అంతే. అంత అమృతహృదయులు ఎవ్వరినీ ద్వేషించలేరు. ఊరికే అభిమానం కొద్దీ పంతం చెల్లించుకోవాలనే పట్టుదలతో అలా గున్నారు కాని లోలోపల చాలా ప్రేమ వుంది ఆయనకు మాధవిపై కంటె నే నంటే ఎక్కువ ప్రేమాభిమానా లని నే ననుకుంటున్నాను.''

''అనుకోవడ మేమిటి ? అక్షరాలా నిజం కూడానూ అందుకు నిదర్శనం చెప్తాను వినండి. తమ్ముడు నారాయణరావు వివాహం ఈ మధ్యనే చేయాలని మా పట్టు ఈ కారణంగానైనా కలువవచ్చు నని మా ఉద్దేశ్యం. 'ఇప్పు డొద్దు' అంటారు కాని నాన్నగారు కారణం చెప్పరు. బిందును పిలవకూడ దని పట్టుదల, కాని పిలువకుండా వుండడానికి మనసు ఒప్పదు. అంచేత అసలు ఇప్పట్లో వద్దని అమ్మకూ శ్యాంకూ గట్టిగా పట్టుదల – ఇప్పుడే చేసి మిమ్మల్ని పిలువకుండా అవ మానించా లని.''

శ్రోత లంతా ఆశ్చర్యంగా వినసాగారు

తిరిగి కేశవరావు చెప్పసాగాడు. ''అస లాయన మన సేమిటో తెల్సుకోవా లని మొన్న చమత్కారంగా అన్నాను; 'పోనీ పాణిగారి కీ ఊరునుంచి ట్రాన్స్ఫర్



"స్నేహితురాలు నిర్మలింటికి వెళ్ళావో నీ ఆడబిడ్డ ముష్టికొంప కెళ్ళావో నాకు తెలియ దనుకున్నావా?''

నిశ్చేష్టురాలై నిలబడింది సరోజిని.

దానితో ఆదిలక్ష్మి మరీ తారామండలానికి లేచింది. ''నా కూతురిమీద నాకే లేని మమకారం నీకు పుట్టుకొచ్చిం దేం? ఇది మమ్మల్నీ మమ్మల్నీ దూరం చేయడానికి కాకపోతే ఏమిటి నీ ఎత్తుగడ? రాక్షసీ! ఎంతకైనా తగుదువే నువ్వు!''

"అసలు దానికీ పెళ్ళిచేసినదే ఈవిడ కాదూ అక్కయ్యా?" లోపలినుండి వచ్చిన శ్యాంసుందర్ వెటకారంగా అన్నాడు. వాడితో షికార్లకు పంపీ, పిక్నిక్‌లకు పంపీ ఈవిడేగా వాళ్ళను దగ్గర చేసిందీ? దాని రహస్యా లన్నీ ఈవిడకు తెల్సు."



ఎన్నడూ అత్తగారి కెదురు చెప్పని — శ్యాంసుందర్‌తో మాట్లాడని సరోజిని ఇవాళ ఆ రెండు పనులు చేసింది. "నాయిష్టమైన చోటికి నేను వెళ్ళాను. కూడని ప్రదేశం కాదు. కానిపని కాదు పెద్ద అధికారం చేస్తున్నా రేమిటి?"

"ఏమిటీ? నీకెంత భరోసా వచ్చింది? నన్నే ఎదిరిస్తున్నావా? మీ మామగారు రానీ, వదిలిస్తాను నీ పొగ రంతా. అసలీ ఇంట్లో ఇక కాపురం చేసే యోగ్యత లేనట్లుంది నీకు.''

"అది మీతరంకాదు. చేసుకోండి ఏం చేయగలరో, మీకూ మీకూ కోపాలుంటే నా కేంకోపం మధ్యన మాధవి మీద?" అంటూ వెళ్ళిపోయింది.

"అదే తెల్సుకుందురుగాని సాయంకాలంలోగా." వెనకనుంచి మరో విసురు విసిరింది ఆదిలక్ష్మి. హేళనగా నవ్వాడు శ్యాంసుందర్.

సరోజిని మిన్నకుండలేకపోయింది. "అధికారాలు సంక్రమించడం ఒకఎత్తూ. వాటిని నిలుపుకోవడం మరొక ఎత్తూను." అంటూనే తన గదిలోకి పోయింది.

సాయంకాలం కేశవరావు వస్తూండగానే నిలవేసింది ఆదిలక్ష్మి. "ఇలారారా కేశవ్. ఏమిటి నీ భాగోతాలూ నువ్వూను ? "

"ఏమిటి ?'' ఎదురు ప్రశ్నించాడు కేశవ్

"మధ్యాహ్నం ఎక్కడికి వెళ్ళావు ?" సూటిగా ప్రశ్నించింది, అతడు ఏవిధంగా బెదురుచూపులు చూస్తాడో గమనించసాగింది

కాని ఆవిడ ఆశించిన దేమీ జరుగలేదు. బింకంగా అన్నాడు కేశవ్ "మాధవిని చూడ్డానికి వెళ్ళాను. ఏం, ఏమొచ్చింది నీకు అంతలో ? ఏమైనా సీ ఐ డీలను వేశా వేమిటి నామీద ?''

నివ్వెరపోయిన ఆదిలక్ష్మి తేరుకోవడానికి చాలాసేపు పట్టింది. ఆ వ్యవధిలో కేశవరావు అక్కడనుండి జారుకున్నాడు కాని ఆదిలక్ష్మి అంతతో వదలిపెట్టే ఘటం కాదు. కేశవ్ వెనుకనే అతడి గదిలోకి వెళ్ళింది. సరోజనికూడా అక్కడే వుంది.

"అయితే నువ్వూ నీ భార్యా కలసి ముందే పధకం వేసుకున్నా రన్నమాట ? కాని పని చేసి పైగా ఎదిరిస్తున్నావా ? అమ్మ అనే గౌరవ ముందా నీకు ఏకోశానైనా ?"

కోటు విప్పుతూన్న కేశవ్ ఆగి వెనక్కు చూచాడు. "గౌరవం పొందడానికీ అధికారం చెలాయించడానికీ మాత్రమే అమ్మవౌతావా ? ఆదరించి లాలించి కోర్కెలు తీర్చవలసిన బాధ్యతకు దూర మౌతావా ? ఏం అందంగా వుంది వ్యవహారం ? ''

"ఏమి టా వెటకారం ?"

''ఉన్నమాటే. కని పెంచినంత మాత్రానే తల్లీతండ్రీ అయిపోరు ''

"సరే నీకూ ఆ బిందుకు పట్టిన గతే పట్టగలదు ఇక ఈ యింట్లో వుండే యోగ్యత లేదు " విసురుగా వెనుదిరిగింది.

హేళనగా నిర్లక్ష్యంగా నవ్వాడు కేశవ్. "బెదరిస్తున్నావా ? చాలు, అది నీకే సిగ్గుచేటు, నే నేమీ కూతుర్ని కాను, కొడుకును. తెల్సుకో."

"అదే అదే, చూద్దాం "

సాయంత్రం ఆఫీసునుండి తిరిగివచ్చిన అనంతయ్యకు కాఫీ పలహారా లిస్తూ అంది ఆదిలక్ష్మి. "మీకు వట్టి ఆవేశమే కాని ఆలోచన లేదు ఎవర్ని ఎలా అదుపులో పెట్టాలో బొత్తిగా తెలియదు."

ఈ ఉపోద్ఘాత మంతా దేనికి పీఠికో తెలియక అర్థంకానట్టు చూచాడు అనంతయ్య.

మెల్లగా శ్యాంకూడా జేరాడు అక్కడికి.

"ఇవ్వాళ ఎంతపని జరిగిందో తెలుసా ? నేను చూడబట్టి సరిపోయింది కాని లేకుంటే ఇంకా ఎంతకాలమైనా ఆ భాగోతం అలాగే జరుగును.'' ఘనకార్యం చేసినట్టు చెప్తూ సగర్వంగా చూచాడు శ్యాం.

''ఇంతకూ ఏమి టది ? "

"ఏముంది ?" ఆదిలక్ష్మి మొదలు పెట్టింది. ''మీరు ఎవరినైతే ఒదులుకున్నారో వాళ్ళ యింటికే మీ కొడుకూ కోడలూ రాకపోకలు సాగిస్తూన్నారు. ఎమేమో బుట్టలతోనూ, పెట్టెలతోనూ పట్టుకుపోయి యిచ్చి వచ్చారట చూశారా వాళ్ళ అగడాలు ? పైగా నేనడిగితే నీ లెక్కేమిటి పొమ్మంటున్నారు ఇద్దరూను."

ఆకాశాని కెగిరి పడతా డనుకున్న అనంతయ్య వదనంలో ఒక్క క్రోధవీచికైనా దర్శన మివ్వకపోవడం, కనీసం నోటినుండి ఒక్క ఆగ్రహ వాక్యమైనా వెలువడకపోవడం చూచి ఆశ్చర్యమైంది అక్కా తమ్ము ళ్ళిద్దరికీ. నీళ్ళుగారిపోతూ ముఖ ముఖాలు చూచుకున్నారు, ఏమీ విశేషమే విననట్టు మౌనంగా తన గదిలోకి వెళ్ళి పోతూన్న అనంతయ్యను చూచి. అయినా అనంత గంభీరత్వం కూడ ఒక్కొక్కప్పుడు ప్రళయసూచికే అవుతుంది గనుక మరి మాట్లాడకుండా వూరుకున్నారు అప్పటిమట్టుకు రాత్రివరకూ ఎదురు చూచారు, అనంతయ్య కొడుకునూ కొడల్నీ తీవ్రంగా మందలించితే ఆనందంగా తిలకించుదా మని. కాని అస లా సూచనలే ఏమీ కన్పించకపోవడంతో తిరిగి రాత్రి భోజనాలదగ్గర ఎత్తింది ఆ విషయం అతి యుక్తిగా ఆదిలక్ష్మి.

"కన్నంతమాత్రాన మనం తలిదండ్రులమే కాదట. మనకు అధికారాలు విలుపుకోవడం చేతకాదట. మీ కొడుకూ కోడలూ నా కివాళ క్రొత్తగా ఒకవిషయం బోధిస్తున్నారు."

ఆమె ఎప్పుడైతే ఆ ధోరణిలోకి దిగిందో, వెంటనే ఒకరివెనుక ఒకరు త్వర త్వరగా అక్కడినుంచి వెళ్ళిపోయారు కేశవరావూ, సరోజనీ.

''ఎన్నెన్ని సామానులు పట్టుకువెళ్ళా డనీ ? ఏ రెండుమూడువేలో తీసుకుని వుంటాడు మళ్ళీ; ఆ వేళ నాలుగువేలూ అలాగే తీసుకుని ఏమీ తెలియనట్టు నాటక మాడాడు. చూచారా బావగారూ ?" శ్యాంసుందర్ అనంతయ్యకు నూరిపోయ సాగాడు.

—సశేషం.

Printed and Published by A Sudhakar Rao from Yuva Press, 5-9-88,
Public Garden Road, Hyderabad-1 Controlling Editor Sri "CHAKRAPANI"

# యువ

## సెప్టెంబరు నెల నుంచీ 180 పేజీలు

## వెల ఒక రూపాయి

ఈ సంచికలో మీరు బంకిమ చంద్రుని 'దేవీ చౌధరాణి' చదివారు ఇది వారి పెద్దనవలకు సంక్షిప్తీకరణ. సెప్టెంబరు నుంచి వారివీ ఇంకా ఇతరులవి మంచి మంచి నవలలు సంక్షిప్తీకరించి, సచిత్రంగా ప్రచురించ నిశ్చయించాము

నవల దాదాపు 80 పేజీలు ఉంటుంది

న్యాయానికి మీరిచ్చే రూపాయి
ఈ నవలే చేస్తుంది.

మిగతా కథలు కార్టూనులు ఉచితం!!

ప్రశ్నా వేదిక ఆగస్టునుంచి ప్రవేశ పెడతాము-ప్రశ్నలు పంపండి

